

EKCO
(REGD)
SKETCH PEN
FOR
SKETCHING
COLOURING • SIGNING
IDEAL FOR
SCHOOLS/COLLEGE STUDENTS
ARTISTS • EXECUTIVES
EKCO (REGD) SKETCH PEN

# చందమామ

ఈ సంచికలో

కథలు-వింతలు-విశేషాలు

*



*

ఇవిగాక అమరవాణి,

కథాశీర్షిక పోటీ

ఫోటో వ్యాఖ్యలూ వగైరా.

సింహళ భాషలో
# చందమామ
విడుదల



శ్రీలంక ప్రధాన మంత్రి
## శుభాకాంక్షలు

దేశానికి నిర్వివాదంగా జీవంగా భావించదగిన యువతరానికి, వారికి సరి అయిన మార్గంలో నడిపించగల గ్రంథాలూ, పత్రికలూ సమకూర్చడం ఎంతైనా అవసరం. అంతేగాక, పిల్లలు చదివి ఆనందించి, వారి జ్ఞాన సామర్థ్యాలను పెంచి, వారి అంతర్గత సుగుణ సంపత్తిని అన్నివిధాలా పెంపొందించగల రచనలను ఎన్నిక చెయ్యడం అత్యంత శ్రద్ధతో జరగవలసిన పని.

ఈ ఆశయం సిద్ధించగలందులకు సింహళ భాషలో "అంబిలిమామ" మాసపత్రికను వెలువరించిన "చందమామ" ప్రకాశకుల కృషి ప్రశంసనీయమైనది.

ఈ ప్రచురణ ద్వారా కథలూ, రకరకాల జానపద కథలూ, పంచతంత్ర, హితోపదేశ కథలూ, మహాభారతమూ చదవడానికి గొప్ప అవకాశం లభించడం పేర్కొనదగును.

ఇందువల్ల కలిగే ఇతర అవకాశాలేవంటే, భారతదేశానికీ, సింహళానికీ అనాదిగా వస్తున్న సాంస్కృతిక సంబంధాలు అవగాహన కావటమేగాక, ఉభయదేశ ప్రజల మధ్య శాంతి, సహకార బంధాలు దృఢం కాగలవు.

"అంబిలిమామ" ప్రచురణ ప్రారంభించినందుకు ప్రచురణకర్తలను అభినందించుతూ, ఎంతో సముచితమైన ఈ పత్రిక అభ్యుదయకరంగా, మన యువతరానికి లాభదాయకంగా ప్రచురణ అవుతూ వస్తుందన్న ఆశాభావాన్ని వెలిబుచ్చుతున్నాను.

ఆర్. ప్రేమదాస

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల నుంచి కొత్త రంగులబొమ్మ సీరియల్ ''భల్లూక మాంత్రికుడు'' ప్రారంభమవుతున్నది. ఇది కూడా పాఠకుల ఆదరాభిమానాలు సంపాదించుకుంటుందని తలుస్తాము.

ఈ నెల బేతాళకథ [''అర్థంలేని పరీక్ష''] పి. వి. ఎస్సెస్సెన్రాజు రచన. విద్యార్థులకు పరీక్ష లున్నట్టే, సామాన్య ప్రజలకు కూడా జీవితంలో పరీక్షలుంటాయి. ఆ పరీక్షలలో నెగ్గినవాడు నిలబడగలుగుతాడు. పరీక్షలు మనుషులు పెట్టినా, జీవితంలో ఏర్పడినా, వాటి అంతర్యం గ్రహించినవాడు తప్ప నెగ్గలేడు.

సంపుటి 63 జూలై '78 సంచిక 7

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00




CHITRA



# అమరవాణి

యో హి దత్త్వా ద్విపశ్రేష్ఠం
కక్ష్యాయాం కురుతే మనః
రజ్జుస్నేహేన కిం తస్య
త్యజతః కుంజరోత్తమం? 1

[ఉత్తమమైన ఏనుగును దానం ఇస్తూ దాని కట్టుతాడు కోసం మధనపడడంలో అర్థం ఏమిటి?]

సుపాత్రదానాచ్చ భవేద్ధనాఢ్యో,
ధనప్రభావేణ కరోతి పుణ్యం,
పుణ్యప్రభావాత్సురలోకవాసీ,
పునర్ధనాఢ్యః, పునరేవ భోగీ. 2

[పాత్రదానంచేసి ధనవంతుడౌతాడు. ధనం ఉన్నది గనక పుణ్యం చేస్తాడు. పుణ్యం చేశాడు గనక స్వర్గం పొందుతాడు. తిరిగి ధనవంతుడై, భోగాలు అనుభవిస్తాడు.]

కుపాత్రదానాచ్చ భవేద్దరిద్రో,
దారిద్ర్యదోషేణ కరోతి పాపం,
పాపప్రభావాన్నరకం ప్రయాతి,
పునర్దరిద్రః, పునరేవ పాపీ. 3

[అపాత్రదానం చేసి దరిద్రుడౌతాడు. దరిద్రుడై పాపం చేస్తాడు. పాపంచేసి నరకానికి పోతాడు. తిరిగి పాపీ, తిరిగి దరిద్రుడూ అవుతాడు.]

దానం




## 61

"చేతికి చిక్కినది మూర్ఖత్వం వల్ల చెయ్యి జారిపోతుంది. మొసలికి లభించిన దాన్ని కోతి నష్టపోయేలాగ చేసింది," అన్నాడు విష్ణుశర్మ.

"మా కా కథ చెప్పండి," అన్నారు రాజకుమారులు. విష్ణుశర్మ ఇలా చెప్పాడు:

సముద్రతీరాన ఒక లోతైన సముద్రపు పాయ ఒడ్డున ఒక గొప్ప నేరేడుచెట్టు ఉండేది. దాని నిండా గుత్తులు గుత్తులుగా పళ్ళుండేవి. రక్తముఖం అనే కోతి ఆ చెట్టు మీద నివసించేది. దిగువన నీటిలో కరాళముఖం అనే మొసలి నివసించేది. ఒకరోజు మొసలి ఒడ్డుకు ఈదుకువచ్చి, నేరేడుచెట్టు కింద ఇసుకలో ఎండలో పడుకున్నది.

"నువ్వు నా అతిథివి. కనుక నేను నీకిచ్చే అమృతంలాటి నేరేడుపళ్ళు తిను. వైశ్వదేవయజ్ఞం పూర్తి అయిన తరుణంలో వచ్చిన అతిథికి భోజనం పెడితే, అతను మిత్రుడయేది, శత్రువయేది, విద్వాంసుడయేది, పామరుడయేది, మనకు స్వర్గప్రాప్తి కలిగిస్తాడు. వైశ్వదేవయజ్ఞం పూర్తికాగానే వచ్చినవాణ్ణి, 'నీది ఏ వేద శాఖ? ఏ కులం? ఏ విద్య నేర్చావు? నీ కుటుంబం ఏది?' అని అడగకుండా అతిథి సత్కారాలు చేసి, తృప్తిగా భోజనం పెట్టాలని మనువు చెప్పాడు. వైశ్వదేవయజ్ఞం ముగిసినప్పుడు ప్రయాణ ప్రయాసతో వచ్చిన అతిథిని సత్కరిస్తే ఉత్తమలోకాలు కలుగుతాయి. అతిథులను వెళ్ళగొట్టినా, వారు వెళ్ళిపోయేలాగ చేసినా దేవతలూ, పితృదేవతలూ విముఖులౌతారు," అని చెప్పి కోతి మొసలికి నేరేడుపళ్లు ఇచ్చింది.

మొసలి నేరేడు పళ్ళు తిని, కోతితో చాలాసేపు ఇష్టాగోష్ఠి జరిపి, తన నివాసానికి వెళ్ళిపోయింది. అటు తరవాత కోతీ, మొసలీ నేరేడుచెట్టు నీడలో కలుసుకుని, రోజూ దీర్ఘమైన శాస్త్ర చర్చలు చేసేవి.

ఒకనాడు మొసలి తినగా బోలెడన్ని నేరేడు పళ్లు మిగిలిపోయాయి. అది వాటిని తన నివాసానికి తీసుకుపోయి, తన భార్యకిచ్చింది.

"ప్రియా, అమృతం లాటి ఈ పళ్ళు ఎక్కడివి?" అని నేరేడుపళ్ళు తిని ఆనందిస్తూ మొసలి భార్య అడిగింది.

"ప్రియురాలా, నాకు రక్తముఖం అనే ఆప్తమిత్రం ఒక కోతి ఉన్నది. అది నా పైన గల ప్రీతికొద్దీ రోజూ ఈ పళ్లు ఇస్తుంది," అన్నది మొసలి.

"ఇలాటి అమృతం లాంటి పళ్ళు తినే ఆ కోతి గుండెకాయ ఎంత రుచిగా ఉంటుందో! నీకు నా పైన నిజంగా ప్రేమ ఉంటే, నువు ఆ కోతి గుండెకాయను ఎలాగైనా సరే సంపాయించి, తీసుకురా. దాన్ని తిని నేను జరామరణాలు లేక, నిత్య యౌవనంతో ఉంటూ నీతో సమస్త సుఖాలూ అనుభవించగలను," అన్నది మొసలి భార్య.

"ప్రేయసీ, అలా అనకు. ఆ కోతి నా తమ్ముడిలాటిది. అదీగాక దాన్ని చంపటం నాకు సాధ్యం కూడా కాదు. అందుచేత నీ కోరిక మానుకో. సత్సంగం



ద్వారా ఏర్పడిన మైత్రి సర్వోత్తమమనీ, ఏకగర్భజాతం కూడా దాని తరవాతనేననీ, ఒకే రక్తం పంచుకున్న సోదరుల కన్న కూడా స్నేహితులు ఎక్కువనీ అంటారు." అన్నది మొసలి.

"నువు ఇంతవరకు ఎన్నడూ నా కోరిక నిరాకరించి ఉండలేదు. అందుచేత నీకు ఈ పళ్లు ఇచ్చే కోతి ఆడదై ఉండాలి. నువు దాన్ని ప్రేమిస్తూ ఉండాలి. కాబట్టే నువు రోజంతా దానితో గడుపుతున్నావు. రాత్రివేళ నువు నా పట్ల ఉదాసీనంగా ఉంటున్నావు. నాతో తియ్యగా మాట్లాడవు. నీ హృదయం మరొక స్త్రీ మీద లగ్నమైనట్టు దాన్నిబట్టే తెలుస్తున్నది గదా!" అన్నది మొసలి భార్య.

మొసలి తన భార్య పాదాలమీద పడి, ఆమె ఆగ్రహాన్ని పోగొట్టటానికిగాను దీనంగా మాట్లాడుతూ, "అందాల రాశీ, నీ ఆగ్రహాన్ని పోగొట్టటానికి నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమించే నేను తప్ప ఇంకెవరున్నారు? నీ దాసుణ్ణి, ఆగ్రహించవద్దని నీ పాదాలు పట్టి వేడుకుంటున్నాను." అన్నది.

మొసలి భార్య కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూ, "ఆ స్త్రీ నీ మనసు దోచేసింది. దానితో కులికే నీ హృదయంలో నాకు స్థానం లేదు. దుర్మార్గుడా, ఈ సాష్టాంగ ప్రమాణాలు కూడా దేనికి? అది నీ ఉంపుడు కత్తె కాకపోతే, నేను చంపమంటే దాన్ని ఎందుకు చంపవు? ఆ ఆడకోతిని నువు ప్రేమించావని దీన్నిబట్టి తెలియటం లేదా? ఎందుకిన్ని మాటలు? నువు నాకు దాని గుండెకాయ తెచ్చి తినటానికి ఇయ్యకపోయావో నేను నిరాహారం ఉండి చచ్చిపోతాను." అన్నది.

తన భార్య తీర్మానం విని మొసలి తనలో, "వజ్రమనే బంకా, మూఢుడూ, ఆడదీ, ఎండ్రకాయా, చేపా, తాగుబోతూ, నీలిమందూ పట్టుకుంటే వదలవని ప్రాజ్ఞులు చెప్పనే చెప్పారు. ఇప్పుడు నేనేం చెయ్యాలి? కోతిని చంపటం ఎలా?" అనుకున్నది.



# 199. తొలి కర్షకులు

ప్రపంచంలో మానవుడు మొట్టమొదటిసారిగా నాగరికత నిర్మించినది టిగ్రిస్–యూఫ్రాటిస్ నదుల మధ్య ఉండిన "మెసొపొటామియా" లో. అదే సుమేరియన్ నాగరికత. 8, 9 వేల ఏళ్ళ క్రితం ఈ నాటి ఇరాక్ ప్రాంతానికి చెందిన సంచారజీవులు వ్యవసాయం ప్రారంభించి, నగరాలు నిర్మించి సుమేరియన్ నాగరికతకు పునాదులు వేశారు. బొమ్మలో ఉన్నవి హస్సునానగర శిథిలాలు. వీటిని నిర్మించిన వారికి గృహనిర్మాణమూ, వృత్తివిద్యలూ కూడా తెలుసును. ఇక్కడ చెకుముకి రాతి కొడవలి కత్తులు దొరికాయి.






పూర్వం బ్రహ్మపుత్రానదీ తీరపు అరణ్యాల్లోని ఒక గ్రామంలో, కాళీవర్మ అనే క్షత్రియయువకుడు వుండేవాడు. అతడి తండ్రి మహాయోధుడు. చంద్రశిలానగరపు రాజు కొలువులో సైనికోద్యోగిగా వుంటూ, ఒక యుద్ధంలో మరణించాడు. అప్పటికి కాళీవర్మ పదేళ్ళ వయసువాడు. అతడి తల్లి, భర్తపోయిన దిగులుతో త్వరలోనే చనిపోగా, బలభద్రుడనే విశ్వాసపాత్రుడైన నౌకరు, అతణ్ణి పెంచి పెద్ద చేసి, అన్ని క్షత్రియవిద్యలూ నేర్పాడు.

కాళీవర్మకు ఇరవైఏళ్ళ వయసు నిండగానే, బలభద్రుడు అతడితో, "కాళీ, యిక నువ్వీ కుగ్రామం వదిలి, రాజధానీ నగరానికి పోయి, అక్కడ రాజుగారి కొలువులో ఏదైనా ఉద్యోగం సంపాయించుకోవటం మంచిది," అన్నాడు.

కాళీవర్మకూడా కొన్నాళ్ళుగా యిలాంటి ఆలోచనే మనసులో మెదులుతున్నది. కాని, తమ ప్రాంతాలను పాలించే రాజు జితకేతు డంటే అతడి కేమాత్రం గౌరవం లేదు. రాజు పల్లె ప్రజల నుంచి పన్నులు వసూలు చేయడంలో సమర్థుడేకాని, వాళ్ళను వన్యమృగాల నుంచీ, బందిపోటు దొంగల నుంచీ కాపాడటంలో సమర్థుడు కాదు.

కాళీవర్మ యీ మాటే బలభద్రుడుతో చెప్పి, "ఆ చంద్రశిలానగరాన్ని పాలించే రాజు జితకేతు అసమర్థుడు, పిరికివాడు. అలాంటివాడి కొలువులో సైనికుడుగా



చేరి పొట్టపోసుకోవటంకన్న మరి అవమానం వుండదు,'' అన్నాడు.

ముసలి బలభద్రుడు కాసేపు ఆలోచించి, ''రాజుల పరిపాలనా దక్షత చాలావరకు వాళ్ళ ఆస్థానంలో ఉద్యోగులుగా వుండే వాళ్ళ మీద ఆధారపడి వుంటుంది. ఈ జితకేతు తండ్రి మహా పరాక్రమశాలి. నీ తండ్రిలాంటి ప్రతాపవంతులూ, బుద్ధిశాలులూ అతడి కొలువులో వుండేవారు. ఆ రాజు మరణానంతరం యీ జితకేతు సింహాసనం ఎక్కాడు. నా అనుమానం అతడి చుట్టూ కుక్షింభరులూ, ముఖప్రీతి కబుర్లాడేవారూ చేరివుంటారని," అన్నాడు.

''అంతేకావచ్చు! అలాంటి రాజును నేనొక్కణ్ణే ఉద్ధరించగలనా? ఈ గ్రామంలోనే ఉన్న పొలం దున్నుకుని బతుకుతాను,'' అన్నాడు కాళీవర్మ.

''ఆ పని నీ లాంటి క్షత్రియయువకుడు చేయవలసిందికాదు. పైగా నీ తండ్రి మరణించేముందు, తన తుదికోర్కెగా నాకు చెప్పిపోయిందేమిటో తెలుసా?'' అంటూ బలభద్రుడు ఇంటిలోపలికి దారితీసి, అక్కడ ఏనాడూ తెరవని గది తలుపులతాళం తీసి, కాళీవర్మను తన వెంట లోపలికి తీసుకుపోయాడు.

ఆ గదిలో కాళీవర్మ తండ్రి ఉపయోగించిన రకరకాల ఆయుధాలూ, కవచం, దాని పక్కన బంగారు పిడిగల కత్తీ వున్నాయి. బలభద్రుడు కత్తిని కాళీవర్మ నడుముకు బిగించి, కవచాన్ని తొడిగి, ''ఆహా, యివి నీకు అతికినట్టు సరిపోయాయి! క్షత్రియయోధుడుగా జన్మసాఫల్యం చేసుకోమని నీ తండ్రి ఆజ్ఞ; తరవాత నీ యిష్టం,'' అన్నాడు.

తండ్రి తన కోసం వదిలిపోయిన కవచం, కత్తీ ధరించగానే కాళీవర్మ శరీరం పొంగిపోయింది. అతడు ఒరలో నుంచి కత్తిని లాగి, దాని పదును పరీక్షించి చూసి, దాని తళతళమనే మెరుపుకు అచ్చెరువుపడిపోతూ, ''భద్రా, తండ్రిగారి

ఆజ్ఞను శిరసావహిస్తాను! నా భవిష్యత్తును తీర్చిదిద్దవలసింది మొక్క పోయిన నాగటికర్రు కాదు; పదునైన యీ వాడి కత్తి,'' అన్నాడు.

ఆ మాటలకు బలభద్రుడు చాలా సంతోషించాడు. ఆ మర్నాడే కాళీవర్మ చంద్రశిలానగరానికి ప్రయాణమయేందుకు అన్నీ సిద్ధం చేశాడు. కాళీవర్మ కవచం చరించి, కత్తిని నడుముకు బిగించుకుని, దారి ఖర్చులకుగాను నూరు బంగారుమాడలు తీసుకుని, గుర్రాన్నెక్కి బయలుదేరాడు. రాజుగారి కొలువులో ఉద్యోగం సంపాయించిన తరవాత, ఆరు నెలల్లో తిరిగి ఒకసారి తప్పక గ్రామానికి వస్తానని బలభద్రుడికి, అతడు మాట యిచ్చాడు.

అరణ్య మార్గాల వెంట కాళీవర్మ ప్రయాణం, మిట్టమధ్యాహ్నం వరకూ ఎలాంటి ఒడిదుడుకులూ లేకుండా సాగింది. అతడు వెంట తెచ్చుకున్న రొట్టెలు తిని, ఏ చెట్టు కిందనైనా కొంచెం సేపు విశ్రాంతి తీసుకుందామనుకుని, నీళ్ల కోసం ఎక్కడైనా కొండవాగు కనబడుతుందేమో అని, మార్గం నుంచి గుర్రాన్ని పక్కకు తిప్పి కొంత దూరం పోయేంతలో, ఒక చెట్టు మీది నుంచి అతడికి పెద్దగా మూలుగు వినిపించింది.



కాళీవర్మ ఆశ్చర్యపోతూ తల ఎత్తి చెట్టు కొమ్మల్లోకి చూశాడు. కొమ్మల్లోంచి మానవాకారం ఒకటి చిన్నగా కేక పెట్టి, దభీమంటూ జారి, నేల మీద పడింది. కాళీవర్మ చప్పున గుర్రం దిగి ఆ మనిషి దగ్గిరకు పోయాడు. అతడు బాగా వయసు మళ్ళినవాడు. పైనుంచి పడినందువల్ల అతడు గాయపడిన సూచన లేమీలేవు. ముసలివాడు లేచి నిలబడబోయి, నడుం పట్టుకుని పెద్దగా మూలిగి, తిరిగి నేల మీద చతికిలబడ్డాడు.

కాళీవర్మ అతణ్ణి సమీపించి, ''ఏం, తాతా, యీ వయసులో నువ్వు చెట్టు ఎక్కటం ఏమిటి? జిహ్వాచాపల్యం కొద్దీ



తేనేతుట్టె కొట్టబోయావా?'' అని అడిగాడు.

ముసలివాడు, కాళీవర్మ కేసి ఒకటి రెండు క్షణాలు పరీక్షగా చూసి, ''నాయనా, నువ్వేదో రాజుగారి భటుడిలావున్నావు, అవునా? సాధారణంగా పంటల తరుణంలో పన్నులు వసూలు చేసేందుకు తప్ప, మీరు యీ ప్రాంతాల మరేనాడూ కనబడరు గదా!'' అన్నాడు.

''నేను రాజభటుణ్ణి కాదు; ఆఉద్యోగం కోసం నగరానికి పోతున్నవాణ్ణి. నే నడిగిన దానికి జవాబు చెప్పావుకాదే! తేనెతుట్టె ఎక్కడ? కాళ్లూ, చేతులూ విరక్కపోవటం నీ అదృష్టం,'' అన్నాడు కాళీవర్మ.

ముసలివాడు మౌనంగా లేచి నిలబడి, నాలుగైదడుగులు నడిచి, తృప్తిగా తలాడిస్తూ, ''నువ్వన్నట్టు అదృష్టవంతుణ్ణే. అలా కాకపోతే, యీసారి బందిపోటు దొంగలు గ్రామం మీద పడినప్పుడు, ఇంటనే వుండిపోయి, వాళ్ళవల్ల నానా హింసలూ పడవలసివచ్చేది,'' అన్నాడు.

ముసలివాడు యిలా అన్న తరవాత కాళీవర్మకు సంగతి కొంతవరకు అర్థమైంది. ముసలివాడు బందిపోటుదొంగల నుంచి పారిపోయి వచ్చి, చెట్టు మీద దాక్కొని, అక్కడ పట్టుజారి కింద పడ్డాడన్న మాట!

''తాతా, యీ ప్రాంతాల బందిపోటు దొంగల బెడద జాస్తి అని నేనూ విన్నాను. కాని, వాళ్ళు పట్టపగలే గ్రామాలమీదపడి దోచుకుపోతారని వినలేదు. మీ వాళ్లంతా ఏమయారు?'' అని అడిగాడు కాళీవర్మ.

''బందిపోట్లు రావటం చూస్తూనే అంతా తలొకదిక్కుకూ పారిపోయారు. వాళ్ళు గ్రామం వదలగానే ఒకళ్ళొకళ్ళు ఇళ్ళకు తిరిగి వస్తారు. ఇది మాకు మామూలే,'' అన్నాడు ముసలివాడు.

''ఈ బందిపోట్ల సంగతి రాజుగారికి తెలియపరచక పోయారా? ఆయన భటులను పంపి, వాళ్ళను వేటాడించే వాడు,'' అన్నాడు కాళీవర్మ. రాజు

సంగతి తెలిసి వుండీ, ముసలివాడు ఏం జవాబిస్తాడో చూద్దామని.

తాత దిగులుగా ముఖం పెట్టి, "కబురంపకుండానే రాజుగారి భటులు వచ్చి, మా పంటల్లో సగం ఎత్తుకుపోతారు, మిగిలిన సగం యీ చుట్టుపక్కల కొండల్లో వుండే బందిపోట్లు దోచుకుపోతారు. రాజుగారికి యీ సంగతి తెలియందికాదు," అన్నాడు.

అంతలో చెట్లచాటు నుంచి నలుగురు బందిపోటు దొంగలు ముందుకు వస్తూ, "ఆహాఁ, ముసలివాడు మహబాగా చెప్పాడు. ఇక ముందు ముందు పండిన పంటల్లో రాజుగారి భాగం కూడా మేమే పుచ్చుకోబోతున్నాం," అంటూ కత్తులెత్తి, కాళీవర్మతో, "కవచం, కత్తీ, గుర్రం— నీ వాలకం చూస్తూంటే, వెంట నాలుగు డబ్బులు మోసుకొస్తున్న వాడివిలాగే కనిపిస్తున్నావు. ఏదీ, ఆ డబ్బు సంచీ నేలమీద పెట్టి, నాలుగడుగులు వెనక్కు నడువు," అన్నారు.

కాళీవర్మ, దొంగల కేసి ఒకసారి తీవ్రంగా చూసి, గుర్రం దగ్గిరకుపోయి, దాని జీను నుంచి వేళ్ళాడుతున్న చిన్న రొట్టెల మూటను తెచ్చి, నేల మీద పడవేసి, రెండడుగులు వెనక్కు నడిచాడు. దొంగల్లో ఒకడు ఆశగా ముందుకు వచ్చి, వంగి మూటను ఎత్తబోయేంతలో కాళీవర్మ చర్రున కత్తి దూసి, వాడి మెడను ఒక్కదెబ్బతో తెగవేసి, చప్పున





ముందుకు దూకి, మరిద్దరు దొంగలను కత్తితో గుండెల్లో పొడిచాడు.

నాలుగో దొంగ ప్రాణభీతితో పెద్దగా అరిచి పారిపోబోయేంతలో, కాళీవర్మ పరుగు పరుగునపోయి వాడి జుట్టు పట్టుకుని, నడుం మీద గట్టిగా ఒక తన్ను తన్ని, వాడు కూలబడగానే, బర బరా ముసలివాడి దగ్గిరకు యీడ్చుకు వచ్చాడు.

హఠాత్తుగా తన కళ్ళ ఎదుట ముగ్గురు దొంగలు హతం కావటం, నాలుగవవాడు కాళ్ళూ, చేతులూ కొట్టుకుంటూ, చావు కేకలు ప్రారంభించటం చూసి, ముసలివాడు వణికిపోతూ, "నాయనా, ఏమి నీ సాహసం! మా గ్రామంలో నీ కన్న బలం గల యువకు లెంతమంది లేరు! వాళ్ళే నాడైనా తెగించి, యీ బందిపోట్ల నెదుర్కొని, ఒక్కగానొక్కణ్ణయినా చంపగలిగారా?" అన్నాడు.

"ఆ పని మీవాళ్ళచేత నేను చేయించిగాని, రాజధానికి పోను. ఆకలి సంగతి తరవాత; ఈ రొట్టెలమూట పట్టుకుని, నువు ముందుండి మీ గ్రామానికి దారి తియ్యి. ఈ బందిపోటునూ, గుర్రాన్నీ నేను వెనకగా తీసుకువస్తాను," అన్నాడు కాళీవర్మ.

ముసలివాడూ, కాళీవర్మా ఆక్కణ్ణించి బయలుదేరబోయేంతలో, కొందరు గ్రామస్థులు అక్కడికి రొప్పుతూ, రోస్తూ వచ్చి, "తాతా, ఏమైంది? ఆ చావుకేకలు పెట్టిందెవరు?" అని అడిగారు.

కాళీవర్మ వాళ్ళకేసి అసహ్యపడుతూ చూసి, "మీలో గుడ్డివాళ్ళెవరూ వున్నట్టు లేదు. జరిగిందేమిటో కనబడటం లేదా? గ్రామాలమీద పడి దోచుకునే బందిపోటు దొంగలను కలిసికట్టుగా ఎదిరించటం పోయి పిరికి పందల్లా అరణ్యంలోకి పారిపోయే మీరు ఏమన్న మనుషులు?" అన్నాడు.

ఆ మాటలకు అందరూ తలలు వంచుకున్నారు. ముసలివాడు, వాళ్ళకు జరి

గిందేమిటో చెప్పి." ఒరే, మన గ్రామం లోనే కాదు, చుట్టుపక్కల వున్న గ్రామాల్లోని నా బోటి ముసల ముతక జనాన్ని వదిలేసి, మిగిలినవాళ్ళు, యీ కుర్రవాడిని పెద్దగా చేసుకుని, కొండల్లోని బందిపోట్లను దుంపనాశనం చేయండి. పట్టపగలే కొంపా గోడూ వదలి, అరణ్యంలో ఎంతకాలమని తల దాచుకుంటాం? మనం మనుషులమా లేక లేళ్ళూ, కుందేళ్ళలాంటి హీనజాతి జంతువులమా?" అన్నాడు కోపంతో నిలువెల్లా వణికిపోతూ.

కాళీవర్మ ఆ మాటలకు తృప్తిగా తలాడించి, "నే చెప్పాలనుకున్నది, మీ గ్రామవృద్ధుడే చెప్పాడు. ఈ దొరికిన దొంగ ద్వారా, కొండల్లోని తతిమ్మా బందిపోట్ల స్థావరాలు తెలుకోవటం ఏమంత కష్టం కాదు. మీలో కత్తి, ఈటె పట్టగలవాళ్ళు, నా వెంటరండి. ఒక్క వారం రోజుల్లో బందిపోట్లనందర్నీ సర్వనాశనం చేసి, నా దారిన నేను పోతాను," అన్నాడు.

గ్రామస్థులు కాళీవర్మను సగౌరవంగా తమ గ్రామానికి తీసుకుపోయి విందు భోజనం పెట్టారు. ఆ సాయంకాలమే కొందరు యువకులు దూర గ్రామాలకు పోయి, మరి కొందరు యువకుల్ని తీసుకు వచ్చారు. కాళీవర్మ, వాళ్ళకు



బందిపోట్లను ధైర్యంగా ఎలా ఎదుర్కోవాలో చెప్పాడు.

దొరికిన బందిపోటు దొంగ అంతగా హింసపడకుండానే, కొండల్లోని ఏగుహలో, లోయలో ఎంతెంత మంది బందిపోట్లు వున్నారో, అక్కడికి వెళ్ళేందుకు వున్న రహస్య మార్గాలేమిటో కాళీవర్మకు చెప్పేశాడు.

కాళీవర్మ, గ్రామయువకుల్ని వెంటబెట్టుకుపోయి, హఠాత్తుగా దాడులు చేసి, చాలామంది బందిపోట్లను చంపాడు. చావగా మిగిలినవాళ్ళు రాజ్య సరిహద్దులు దాటి, కొండల కావలనున్న అరణ్యాల్లోకి పారిపోయారు.

బందిపోట్ల వేట ముగిసిపోగానే కాళీవర్మ తిరిగి రాజధానీ నగరానికి బయలుదేరాడు. పదిహేను రోజుల ప్రయాణం తరవాత అతడు అరణ్యం దాటి, చంద్రశిలా నగర పరిసరాలను చేరబోతూండగా, ఒకనాటి సూర్యోదయం వేళ, హఠాత్తుగా పదిమంది ఆశ్వికులు వచ్చి అతణ్ణి చుట్టు ముట్టారు. కాళీవర్మకు, ఒర నుంచి కత్తిదూసేందు కూడా సమయం లేదు.

ఆశ్వికులనాయకుడు, అతడి కేసి కొర కొర చూస్తూ, "నువ్వు, కాళీవర్మవు కాదా? బందిపోట్లను రాజ్యసరిహద్దుల లోని, అరణ్యాల నుంచి పొరుగు రాజ్యం లోకి పారదోలినవాడివి, నువ్వేగదా?" అని అడిగాడు.

"అవును, ఆ పని చేసింది నేనే! అలాంటి నన్ను ఎంతో గౌరవంగా నగరానికి తీసుకుపోయి, రాజదర్శనం చేయించ టానికి బదులు, యిలా బందిపోటును చుట్టుముట్టి పట్టుకుంటున్నట్టు, పట్టుకో బోతున్నారేం?" అని అడిగాడు కాళీవర్మ ఆశ్చర్యపోతూ.

ఆ జవాబుకు ఆశ్వికుల నాయకుడు పెద్దగా నవ్వి, "నువ్వు, జితకేతు రాజు గారికి చేసిన ద్రోహం అంతాయింతాకాదు. ఇక్కణ్ణించి పారిపోయిన దొంగలు పొరుగు రాజ్యంలో బందిపోట్లు ప్రారంభించారు. ఆ రాజు, మా రాజుగారే యిందుక్కారణం అని, చంద్రశిలానగరం మీదికి దండెత్తి రాబోతున్నాడు. ఈ గొడవ కంతకూ కారణం అయిన నిన్ను, ఉరితీసి, శవాన్ని ఆ రాజుకు పంపబోతున్నాం." అన్నాడు.

"ఆ జితకేతు రాజుతోపాటు మీకూ మతులుపోయినయ్యా!" అంటూ కాళీవర్మ కత్తి పిడిమీద చేయి వేయ బోయేంతలో, ఆశ్వికులు అతడి మీదపడి కాళ్ళూ, చేతులూ కట్టి, గుర్రం మీదవేసి, ఉత్సాహంగా కేకలుపెడుతూ, నగరం కేసి బయలుదేరారు.

—(ఇంకావుంది)






## అర్థంలేని పరీక్ష

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి బయలుదేరాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నిన్ను ఎవరైనా పరీక్ష చేస్తున్నారేమో తెలియదు. కాని కొందరు బొత్తిగా అర్థం లేని పరీక్షలు పెట్టి, లేనిపోని కష్టాలు కలిగిస్తారు; వాటివల్ల ఎవరికీ కొంచెం కూడా ప్రయోజనం ఉండదు. అందుకు నిదర్శనంగా నీకు కాంచనవర్మ కూతురు రత్నప్రభ కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్ప సాగాడు:

పూర్వం సింహపురి రాజ్యాన్ని ఏలిన కాంచనవర్మకు రత్నప్రభ అనే కూతురు ఉండేది. ఆమెకు యుక్తవయసు వచ్చి, వివాహం చేద్దామనుకుంటున్న సమ

## బేతాళ కథలు

యంలో కాంచనవర్మ ఆకస్మికంగా చనిపోయాడు. తలవని తలంపుగా రత్న ప్రభ రాజ్యానికి వచ్చింది. చిత్రమేమి టంటే, ప్రజాపాలనలో ఆమె తండ్రికి ఏమాత్రమూ తీసిపోక, చాలా కొద్దికాలం లోనే అంతులేని పేరుప్రఖ్యాతులు సంపా దించుకున్నది. ప్రజల కష్టాలను వెయ్యి కళ్లతో కనిపెట్టి ఉండి, వాటిని ఎప్పటి కప్పుడు తీర్చటమే మంచి పరిపాలనలో ఉండే రహస్యమని ఆమె బహిరంగంగా చెబుతూ ఉండేది.

సింహపురిని ఆనుకుని ఉన్న విజయపురి రాజు రవివర్మ రత్నప్రభను పెళ్లాడ గోరాడు. అలా చేస్తే రెండు రాజ్యాలూ తనవి కావటమే గాక, పరిపాలనా దక్షత గల రత్నప్రభ సహాయంతో తాను కూడా గొప్ప ప్రజాపాలకుడుగా ఖ్యాతి సంపా దించవచ్చునని అతని ఆశ.

అతను దూతలను పంపటానికి మారుగా తానే స్వయంగా రత్నప్రభ వద్దకు వెళ్ళి, తన కోరికను ఆమెకు తెలియజేశాడు.

అంతా విని రత్నప్రభ, ''మీరు నన్ను పెళ్లాడ గోరటం నాకు మహాభాగ్యమే గాని, నా భర్త కాగోరే వారికి నేను ఒక చిన్న పరీక్ష పెట్టదలచాను. అది మీకు సమ్మతమవుతుందా ?'' అని రవివర్మను అడిగింది.

''తప్పక సమ్మతమవుతుంది. పరీక్ష ఏమిటో చెబితే అందులో నెగ్గటానికి



శాయశక్తులా ప్రయత్నిస్తాను,'' అన్నాడు రవివర్మ.

''మరేమీ లేదు. హిమాలయ పర్వతాలలో శంఖవృక్షం అనేది ఉంటుంది. మీరు ఎంత శ్రమపడి అయినా సరే దాని పూలు తీసుకురావాలి. అదే పరీక్ష," అన్నది రత్నప్రభ.

''ఓస్, ఇంతేగదా!'' అంటూ రవివర్మ అప్పటికప్పుడే ఎంతో ఉత్సాహంగా తన గుర్రం మీద హిమాలయాలకు బయలుదేరాడు.

అతను గుర్రంమీద హిమాలయాలను చేరటానికి ఎక్కువ కాలం పట్టలేదు గాని, శంఖవృక్షం అనేది ఎరిగినవాళ్ళు, ఎన్నివందల మైళ్ళు తిరిగినా, ఒక్కరూ కనిపించలేదు. ఆ చెట్టు హిమాలయాలలో ఫలాని ప్రాంతంలో ఉండవచ్చునని చెప్పినవారైనా లేరు. వేలకొద్దీ మైళ్ళ విస్తృతిగల హిమాలయాలలో రవివర్మ అనేక మాసాలు తిరిగి, శంఖవృక్షం అనేది లేనేలేదేమో నన్న అనుమానానికి గురి అయి, రత్నప్రభను పెళ్లాడే ఆలోచనకు ఉద్వాసనచెప్పి ఇంటిముఖం పట్టాడు.

అతను తన దేశాన్ని చేరబోతూండగానే, తాను లేని సమయంలో తన రాజ్యాన్ని పొరుగురాజు ఆక్రమించినట్టు విని, అతను రత్నప్రభను కలుసుకుని తాను ఉభయభ్రష్టుడైనట్టు ఆమెకు తెలుపుకున్నాడు.



ఆమె అతనిపట్ల సానుభూతి చూపుతూ, ''మీరు లేని సమయంలో కాలనేమి అనే మీ పొరుగురాజు మీ రాజ్యాన్ని అపహరించినట్లు విన్నాను. విచారించకండి, నా సైన్యంతో ఆ కాలనేమిని జయించి మీ రాజ్యాన్ని తిరిగి మీకు అప్పగిస్తాను,'' అన్నది.

ఆమె అన్నంతపనీ చేసింది; రవివర్మను తిరిగి సింహాసనంమీద కూర్చోబెట్టుతూ, ''ఇకనైనా మీ రాజ్యాన్ని మీరు ప్రజారంజకంగా పాలించుకోండి,'' అని సలహా ఇచ్చింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, రత్నప్రభ రవివర్మకు పెట్టిన పరీక్షకు అర్థమేమైనా ఉన్నదా? ఆమె అతని పట్ల సానుభూతి చూపి, పోయిన అతని రాజ్యాన్ని తిరిగి గెలిచిపెట్టినప్పుడు, అతన్ని వివాహం కూడా చేసుకుని ఉండవచ్చు గదా? ఆ పని ఎందుకు చెయ్యలేదు? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల బద్దలవుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''రత్నప్రభ రాజనీతిలో ఆరితేరిన మనిషి. రవివర్మ తనను పెళ్లాడగోరటంలో అతని రాజ్యకాంక్ష గ్రహించింది. అయితే అతనికి పరిపాలనా దక్షత ఉన్నదీ, లేనిదీ తెలుసుకునేటందుకే ఆమె అతనికి పరీక్ష నిర్ణయించింది. పరిపాలనా దక్షుడయితే రవివర్మ ఆమె పరీక్ష నిరర్థకమైనదని తేలికగా గుర్తించి ఉండేవాడు. అది తెలుసుకోకనే అతను ఎక్కడా లేని చెట్టు కోసం నెలల తరబడి వృథాగా తిరిగి, తన రాజ్యాన్ని పోగొట్టుకున్నాడు. అతను రాజ్యం పోగొట్టుకోవటానికి తానే కారకురాలు గనక రత్నప్రభ అతనికి తిరిగి రాజ్యం ఇప్పించింది. అంతేగాని అతను తన భర్త కావటానికి అర్హుడు కాడన్న ఆమె అభిప్రాయం మారలేదు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాలుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)





# పారినపథకం

ఒక గ్రామంలో రాజమ్మా, సీతమ్మా అని ఇద్దరు విధవరాళ్ళు ఉండేవారు. రాజమ్మకు రంగయ్య అనే కొడుకూ, సీతమ్మకు జానకి అనే కూతురూ ఉండే వాళ్లు. రాజమ్మ భర్తా, సీతమ్మ భర్తా తమ పిల్లలు పెద్దవాళ్లయాక వారికి పెళ్లి చెయ్యాలని అనుకున్నారు. కాని పిల్లలు చిన్నవాళ్లుగా ఉండగానే వాళ్లిద్దరూ పడవ ప్రమాదంలో చనిపోయారు.

అయితే, పిల్లలు పెద్దవారయే సమయానికి రాజమ్మ బుద్ధీ, సీతమ్మ బుద్ధీ మారిపోయాయి. తన కొడుక్కు మంచి కట్నం తీసుకుని పెళ్లి చెయ్యాలని ఆశ పడింది రాజమ్మ. తన కూతుర్ని పట్నంలో ఇయ్యాలనుకున్నది సీతమ్మ.

కాని రంగయ్యా, జానకీ చిన్నతనం నుంచీ తాము భార్యాభర్తలనే అనుకుంటూ వచ్చారు. తమకు ఇతరత్రా తల్లులు సంబంధాలు చూస్తుంటే వాటిని భగ్నం చెయ్యటానికి ఇద్దరూ విశ్వ ప్రయత్నాలు చెయ్యసాగారు.

ఒకనాడు గంగన్న అనే ఆస్తిపరుడు రంగయ్యను చూద్దామని రాజమ్మ ఇంటికి వచ్చాడు.

రాజమ్మ గంగన్నకు సకల మర్యాదలూ చేసింది. ఆ సమయంలో రంగయ్య ఇంట్లో లేడు, పొలంలో ఉన్నాడు. తనను చూడటానికి ఎవరో వచ్చారని తెలియగానే రంగయ్య వట్టి చేతులతో ఇంటికి తిరిగి వచ్చాడు.

అది చూసి రాజమ్మ, "గొడ్డలి ఏదిరా ?" అన్నది.

"కొట్టే చెట్టు దగ్గిర ఉన్నది." అన్నాడు రంగయ్య.

"కొట్టే చెట్టు ఎక్కడ ఉన్నది ?" అని తల్లి మళ్ళీ అడిగింది.

పి. ఖాదర్ వలీ ఖాన్

"గొడ్డలి ఉన్న చోటే!" అన్నాడు రంగయ్య.

చూడవచ్చిన గంగన్న రంగయ్య జడ్డితనం చూసి నిర్ఘాంతపోయాడు.

రాజమ్మ మాట మారుస్తూ, "ఇంత సేపూ ఏం చేస్తున్నావు?" అని అడిగింది.

"కొబ్బరిచెట్టు ఎక్కాను," అన్నాడు కొడుకు.

"దేనికి?" అన్నది రాజమ్మ ఆశ్చర్యంగా.

"దూడ గడ్డికోసం," అన్నాడు రంగయ్య.

"గడ్డి చెట్టుమీద ఉంటుందా?" అన్నది తల్లి.

"లేదు. అందుకే దిగి వచ్చేశాను," అన్నాడు కొడుకు. ఇది విన్న పెద్దమనిషి, వెళ్ళివస్తానని చెప్పి జారుకున్నాడు.

తరవాత రాజమ్మ తన కొడుకును నానా తిట్లూ తిట్టి, "నీ మొహానికి మంచి సంబంధం వచ్చే గీతలేదు," అన్నది.

"నాకు జానకి కంటె మంచి సంబంధం వస్తుందా?" అన్నాడు రంగయ్య.

జానకి కూడా పట్నం సంబంధం ఒకటి వస్తే అలాగే ప్రవర్తించింది. ఆమెను చూడ వచ్చిన వారిలో ఒకామె, "అమ్మాయీ, పప్పుకు రుచి రావాలంటే ఎలా వండాలి?" అని అడిగింది.

"నిప్పులో పప్పువేసి వండితే మహా రుచిగా ఉంటుంది!" అన్నది జానకి.

అడిగిన ఆమె నోరువెళ్ళబెట్టి ఆశ్చర్య పడింది. ఇంతలో లోపలికి ఒక కోడిపెట్ట వచ్చింది. జానకి చీపురుకట్టతో దాన్ని కొట్టింది.

"అదేమిటే, కోడిపెట్టను అలా కొడతావు?" అని తల్లి ఆమెను కోప్పడింది.

"అత్తగారు అనుకున్నానమ్మా!" అన్నది జానకి పశ్చాత్తాప పడుతున్నట్టుగా.

పెళ్ళి చూపులకు వచ్చినవాళ్ళు వచ్చిన దారినే తిరిగి వెళ్ళారు.

తాము చెప్పిన మాటలు తమ పిల్లలు వినరని రాజమ్మా, సీతమ్మా కూడా తెలుసుకుని, వాళ్ళకు తమ భర్తలు కోరినట్టే పెళ్ళిచేయ నిశ్చయించారు.



# ధర్మం

దానధర్మాలు చెయ్యటంలో పేరుపడిన ఒక జమీందారు తన అంతరంగికుడితో దారిన పోతూండగా ఒక యాచకుడు ఆయన వెంటపడి, "ధర్మ ప్రభువులు! చలికి తట్టుకో లేకుండా ఉన్నాను, బట్టలేవైనా ఇప్పించండి," అని వేడుకున్నాడు.

అంతరంగికుడు ఆ సమయంలో తన బావమరిదికి ఏదన్నా ఉద్యోగం ఇప్పించమని జమీందారును అడుగుతున్నాడు. అతను యాచకుడితో, "మా ఇంటికి వచ్చి తీసుకు వెళ్ళవేయ్," అన్నాడు, జమీందారు బరువు మోసేవాడిలాగా.

యాచకుడు అంతరంగికుడి ఇంటిచుట్టూ చాలాసార్లు తిరిగిన పిమ్మట, అతను తూట్లుపడిన పాత చొక్కా వాడి మొహాన కొట్టి, "ఇక వెళ్ళు!" అన్నాడు. యాచకుడు ఆ చొక్కా మీద "జమీందారుగారి ధర్మం" అని రాసి, దాన్ని తొడుక్కుని తిరగసాగాడు.

అది చూసి జమీందారు యాచకుణ్ణి పట్టుకుని, "ఈ చింకి చొక్కాను నేను నీ కిచ్చినట్టు గుర్తులేదు," అన్నాడు.

"తమ తరఫున తమ అంతరంగికుడుగారు దీన్ని నాకు దయచేయించారు," అన్నాడు యాచకుడు.

జమీందారు వాడికి మంచిబట్టలిచ్చి పంపాడు. —ఎమ్. వి. వి. సత్యనారాయణ.





# బంగారుకాసు మర్మం

రతన్‌పుర రాజు భానుగుప్తుడు మరణించగా ఆయన కుమారుడు సోమగుప్తుడు రాజయాడు. రతన్‌పుర రాజ్యంవర్తకానికి ప్రసిద్ధికెక్కిన, సంపన్న రాజ్యం. భానుగుప్తుడు అర్థశాస్త్ర నిపుణుడు కావటంచేత ఆయన హయాంలో దేశం దినదినాభివృద్ధి చెందింది. ఆయనకు తగిన మంత్రులుండి, మంచి సలహాలు ఇచ్చారు.

సోమగుప్తుడు మరీ చిన్నతనంలో రాజ్యానికి రావటమే గాక, తండ్రికి ఏక సంతానం కావటంచేత మరీ గారాబంగా పెరిగి, దుష్ట స్నేహితుల మధ్య చిక్కుకుని, వారి దుష్ప్రభావాలకు గురి అయాడు. "వాడింకా చిన్నవాడు. నేర్చుకునేటందుకు ఇంకా చాలా వ్యవధి ఉన్నది." అనేవాడు తండ్రి, మంత్రులు సోమగుప్తుణ్ణి రాజకీయాలలో తయారు చెయ్యమన్నప్పుడు.

అయితే భానుగుప్తుడు నడివయసులోనే ఆకస్మికంగా చనిపోవటమూ, రాజ్యభారం సోమగుప్తుడి పైన పడటమూ జరిగింది. ఇరవైరెండేళ్ల వయసు గల సోమగుప్తుడు తన దుష్ట స్నేహితుల సలహాలు విని, అనేకమంది రాజోద్యోగులను తొలగించాడు. చాలాకాలంగా పరిపాలనలో ఉన్న మంత్రులను మాత్రం అతను ఏమీ చెయ్యలేకపోయాడు. వారిపట్ల ప్రజలకు అపారమైన విశ్వాస గౌరవాలుండేవి.

ఒకసారి ఉత్తర సరిహద్దులో ఉన్న కొండప్రాంతంలో చిన్న పితూరీ సాగింది. ఆ కొండప్రాంతం ఒక కోయ దొరది. అక్కడ అలజడి జరుగుతున్నదని ముందే గ్రహించి సేనాపతి కఠిన చర్య తీసుకుని, కోయ రాజ్యంలో కొంత భాగం స్వాధీనపరచుకున్నాడు. సోమగుప్తుడి

ఏ.సి. సర్కార్, ఐంద్రజాలికుడు

మిత్రులలో ఒకడు కోయదొర తాలూకు మనిషి. సేనాపతి కోయదొరకు క్షమాపణ చెప్పుకుని, అతనినుంచి తీసుకున్న కోయ రాజ్యం అతనికి తిరిగి ఇయ్యాలని ఈ మనిషి పట్టుబట్టాడు.

''భానుగుప్త మహారాజు చనిపోయి నప్పుడు ఈ కోయదొర శత్రురాజుతో చేరి కుట్ర తలపెట్టినట్టు నాకు తెలుసు. నా బొందిలో ప్రాణం ఉండగా ఆ కుట్రను సాగనియ్యను. నా దేశంకోసం నేను నా రక్తమంతా ధారపోయటానికైనా సిద్ధమే," అన్నాడు సేనాపతి.

''ఇది నా ఆజ్ఞ!'' అన్నాడు సోమగుప్తుడు.

''అలా అయితే నేను పదవినుంచి తప్పుకోవలసి వస్తుంది,'' అన్నాడు సేనాపతి.

ఈ మాటతో సోమగుప్తుడి కాళ్లు కొద్దిగా చల్లబడ్డాయి, ఎందుకంటే, సేనాపతి పదవి విసర్జిస్తే సేనలో అరాజకం చెలరేగు తుంది. సైనికుల దృష్టిలో సేనాపతి దేవుడిలాటివాడు. అందుచేత సోమ గుప్తుడు తన మిత్రుడి కోరిక తీర్చక, సేనాపతిని అతని ఇష్టప్రకారం చెయ్య నిచ్చాడు.

రతన్‌పుర రాజ్యంలోని బంగారు సిక్కా నాణాలు మేలిమి బంగారుతో



తయారుచేసేవారు. దేశంలో ఉన్న బంగారం దాదాపు యావత్తూ బంగారు నాణాల రూపంలో చలామణీలో ఉండేది. ఈ నాణాలకు పొరుగుదేశాలలో కూడా విలువ ఉండటంచేత ఈ దేశపు వర్తకానికి చాలా మేలు జరిగేది.

అయితే సోమగుప్తుడి మిత్రుడొకడు, ''ఇంకా మీ తండ్రి తాతల నాణాలే చలామణి కావటం ఏమిటి? బంగారు నాణాలలో కొంత రాగిలాటిది చేర్చినట్టయితే, ఆదాచేసిన బంగారం నీ సొంత సొత్తుగా పడిఉంటుంది,'' అని సలహా ఇచ్చాడు.

సోమగుప్తుడు ఈ సలహాను అనుసరించి టంకసాలలో కల్తీ బంగారునాణాలు



అని ధనపతి అడిగాడు.

''ముసలివాడా? డబ్బుగురించి నీకు మాత్రం ఏం తెలుసు? నాణాలలో బంగారం తరిగితే ఇంతలో ఏం కొంప మునిగింది? నాణెంమీద రాసి ఉన్న విలువే నాణెం విలువ,'' అన్నాడు రాజు.

''తమరు పొరపడుతున్నారు, మహారాజా. నాలాగ దీర్ఘకాలం ఆర్థికరంగంలో ఉన్నవాడికి మేలిమి బంగారు నాణానికీ, కల్తీ బంగారు నాణానికీ తేడా వాసన చూస్తే చాలు, తెలుస్తుంది,'' అన్నాడు ధనపతి.

అతను అంతటితో వదలక కోపంతో రెచ్చిపోయి, రాజును ఏమీ తెలియని మూఢుడని తిట్టేశాడు. ఆ మాట వినగానే సోమగుప్తుడి అనుచరులు, ''వాణ్ణి పట్టి బంధించండి!'' అని భటులకు కేక పెట్టారు. రాజును అవమానించినందుకు ధనపతిని కారాగృహంలో పెట్టారు.

సోమగుప్తుడి ధోరణి ఎవరికీ నచ్చలేదు. కాని ఆ మాట పైకి అనే ధైర్యం ఎవరికీ లేకపోయింది. ధనపతి పొందిన శిక్ష గురించి అసంతృప్తి చెందినవారిలో ఆస్థాన ఇంద్రజాలికుడు మాయాధరుడు కూడా ఉన్నాడు. అతను కారాగారానికి వెళ్ళి, ధనపతితో కొంతసేపు రహస్యంగా మాట్లాడి, తృప్తిపడి తిరిగి వచ్చేశాడు.

కొన్ని అచ్చు కొట్టించాడు. ఈ సంగతి త్వరలోనే సభికులకు తెలియవచ్చింది. నిండు సభలో ఆర్థికమంత్రి ధనపతి రాజును సవాలు చేస్తూ, ''కనీసం నాతో సంప్రతించకుండా తమరు ఈ పని చేసి ఉండరాదు. మీ తండ్రిగారి హయాంలో ఇలా ఎన్నడూ జరగలేదు,'' అన్నాడు.

''కాలం మారింది. ఇది మా తండ్రిగారి హయాంకాదు, నా హయాం. నేను మంచిదని తోచినది చేస్తాను," అన్నాడు సోమగుప్తుడు.

''క్షమించండి. మీకు గాని, మీ స్నేహితులకు గాని ద్రవ్యశాస్త్రం గురించీ, డబ్బు చలామణి గురించీ ఏం తెలుసు?"

సోమగుప్తుడు చిన్నవాడై ఉండగా మాయాధరుణ్ణి వదిలేవాడు కాడు. అతను చేసే ఇంద్రజాలమంటే సోమగుప్తుడికి చాలా ఇష్టం.

ఒకనాడు సోమగుప్తుడు తన మందిరంలో ఒంటరిగా, విరామంగా ఉన్న సమయంలో మాయాధరుడు వెళ్ళి, ధనపతి గురించి ప్రస్తావించి, ''మహారాజా, ఒకవేళ ధనపతి చెప్పినది నిజమేనేమో! ఒక్కొక్కప్పుడు అనుభవం ద్వారా అద్భుత శక్తులు కలుగుతాయి. మేలిమి బంగారానికీ, కల్తీ బంగారానికీ మధ్య ఉండే తేడా ధనపతికి వాసనచూస్తేనే తెలుస్తుందేమో! అది అలా ఉంచి, అతను గొప్ప ఆర్థిక నిపుణుడు. బంగారంలో కల్తీని వాసన పట్టే ధనపతి శక్తిని పరీక్షించటం మంచిది. అతనికి అలాటి శక్తి ఉంటే అతన్ని క్షమించవచ్చు. ఎంత చెడ్డా, అతను బహు దీర్ఘకాలం దేశానికి సేవ చేసినవాడు,'' అన్నాడు.

''అతన్ని పరీక్షించటానికి మార్గమేమిటి?'' అన్నాడు సోమగుప్తుడు.

''నాలుగు కల్తీ బంగారు నాణాలూ, ఒక మేలు బంగారు నాణెమూ ఒకేరకం సంచులలో పెట్టి, అన్నీ కలిపేసి, మేలిమి బంగారు నాణెంగల సంచిని తియ్యమందాం. అతను అలా చేయగలిగాడా,



నిజంగా ఆర్థికనిపుణుడే. అవునంటారా?'' అని మాయాధరుడు అన్నాడు.

సోమగుప్తుడు అవునన్నాడు. అతని అనుమతితో మాయాధరుడు ధనపతిని పరీక్షించటానికి ప్రయత్నాలు చేశాడు. ఒకే ఆకారాలూ, రంగూ గల సంచులు అయిదు తీసుకుని, ఒక సంచి తనవేపు తెరిచి పట్టుకుని, సన్నని పుల్లతో సంచిలో ఒకమూల బంకరాచి నొక్కాడు. మిగిలిన నాలుగు సంచులూ మామూలుగానే ఉండిపోయాయి.

ధనపతి పరీక్ష జరిగే రోజు సభ కిటకిట లాడుతున్నది. బల్ల మీద నాలుగు కల్తీ బంగారు నాణాలూ, ఒక మేలిమి

బంగారు నాణెమూ ఉన్నాయి. మాయాధరుడు ఒక్కొక్క నాణెమూ ధనపతి చూస్తూండగా ఒక్కొక్క సంచిలో వేసి సంచి మూతలు అంటించేశాడు. తరవాత, నాణాలున్న సంచులన్నిటినీ ఒక పెద్ద పాత్రలో వేశారు. ధనపతి కళ్ళకు గంత కట్టారు. పాత్రమీద గుడ్డ కప్పారు. ధనపతిని పాత్ర వద్దకు తెచ్చి, దాని మీద కప్పిన గుడ్డ దిగువగా అతని చేతులు పాత్రలో పెట్టారు. ధనపతి సంచులలో వెతికి, తాను తీయవలసి ఉన్న సంచిని రెండు క్షణాలలో పైకి తీశాడు.

ధనపతి తన చేతికిచ్చిన సంచీ నుంచి మాయాధరుడు అందులోని నాణెం పైకి తీశాడు. అది మేలిమి బంగారు నాణెం కావటం చూసి అందరూ ఆశ్చర్యపోయారు.

అదే సమయంలో సేనాపతి కొందరు విదేశీయులను బందీలుగా పట్టుకుని సభలో ప్రవేశించాడు. ఆ బందీలను చూస్తూనే సోమగుప్తుడి మిత్రులు కొయ్యబారి పోయారు. వారు సభలో నుంచి జారుకుంటూండగా సేనాపతి వారిని పట్టుకోమని భటులకు ఉత్తరువిచ్చాడు.

విదేశీయులు తమనేరం ఒప్పుకున్నారు. కొన్ని ఇతరదేశాలు సోమగుప్తుడి మిత్రుల సహాయంతో రతన్‌పురం మీద కుట్ర పన్నినట్టు బయటపడింది. తన మిత్రులే తన దేశాన్ని కొల్లగొట్టటానికి కుట్ర చేసినట్టు సోమగుప్తుడు తెలుసుకుని, తన తప్పు ఒప్పుకుని, తనమంత్రుల సహాయంతో రాజ్యపాలన చేయసాగాడు.

మాయాధరుడు ఒక సంచిలో ఒక మూల బంక రాచి నొక్కాడు గద, ఆ సంచిలోనే మేలిమి బంగారు నాణెం వేశాడు. మిగిలిన కల్తీ బంగారు నాణాలు తామున్న సంచులలో మూలదాకా వెళ్లాయిగాని, మేలిమి బంగారు నాణెం మూలకు కొంత దూరంలోనే ఆగిపోయింది. ధనపతి స్పర్శద్వారా మేలిమి బంగారు నాణెంఉన్న సంచిని తెలుసుకోగలిగాడు.



# ఎంత వర్తకపు సరుకు

సత్యశీలు డనే రాజుకు ఒక నియమం ఉండేది. అతను రోజూ ఉదయం తన వద్దకు ఏ వర్తకుడు వచ్చి ఏ సరుకు అమ్మినా బేరం చెయ్యకుండా కొనేవాడు. అలా చేయటం వల్ల తనకూ, దేశానికీ కూడా లాభమని అతని నమ్మకం.

రాజధాని నగరంలో ఒక నిరుపేద బ్రాహ్మణుడు నివసించేవాడు. ఎంత ప్రయత్నించినా వదలని తన దారిద్ర్యాన్ని రాజుగారికి ఎందుకు అమ్మరాదని అతడికి అనిపించింది. అందుచేత అతను తన చినిగిన గొంగళినీ, చిల్లుల చెప్పులనూ మూటగట్టి, నెత్తిన పెట్టుకుని, తూర్పు తెల్లవారే లోపలనే రాజభవనానికి వెళ్ళి, "ఎవరైనా కొంటారా? మామూలు మనుషులు కొనలేని సరుకు!" అని కేకలు పెట్టాడు.

రాజు వెంటనే అతన్ని లోపలికి రమ్మని, "ఆ మూటలో సరుకేమిటి?" అని అడిగాడు.

"మహారాజా, అది నా దారిద్ర్యం. వంశపారంపర్యంగా నాకు సంక్రమించినది! సొంత సొత్తు!" అన్నాడు బ్రాహ్మణుడు.

"ఎంతకిస్తావు?" అన్నాడు రాజు తడువుకోకుండా.

"అయిదువందల వరహాలు," అన్నాడు బ్రాహ్మణుడు.

రాజు ఆ డబ్బు ఇచ్చి మూటను కొనేశాడు.

—టి. ఎస్. అనూరాధ.





# తల్లీ-కొడుకూ

వరలక్ష్మి అనే సంపన్నురాలికి ఒకడే కొడుకు చంద్రశేఖరుడు. చంద్రశేఖరుడి చిన్నతనంలోనే తండ్రి పోయాడు. అప్పటి నుంచీ వరలక్ష్మి వాణ్ణి ఎంతో శ్రద్ధగా పెంచి, వాడిమీదనే ఆశలన్నీ పెట్టుకున్నది. చంద్రశేఖరుడికి యుక్త వయసు రాగానే వరలక్ష్మి వాడికి సుభద్ర అనే పిల్లను పెళ్ళిచేసి, కోడలిని కాపరానికి తెచ్చుకున్నది.

సుభద్రకు అత్తవారింటి పద్ధతులు అన్నీ తృప్తికరంగానే ఉన్నాయి గాని, తన అత్తగారి దాతృత్వ గుణం మటుకు అసంతృప్తి కలిగించింది. ఆమెతనకున్న దాంట్లో కొంచెం హెచ్చుగానే దాన ధర్మాలు చేసేది. అంతమాత్రాన సుభద్ర మనోవ్యాధి పడవలసిన పనిలేదు. ఎందు కంటే వరలక్ష్మికి గల ఆస్తి ఒకంతట తరిగేదికాదు. కాని సుభద్రలో పిసినారి తనం ఉన్నది. తన భర్త ఎంతో కష్టపడి సంపాదించిన దంతా అత్తగారు దాన ధర్మాల కింద తగలేస్తున్నట్టు సుభద్ర బాధపడింది.

ఈ బాధను ఎంతోకాలం తన మనస్సులో ఇముడ్చుకోలేక, పైకి వెళ్ల గక్కింది సుభద్ర.

"మనకు ఉన్నదాంట్లో నలుగురికీ పెట్టడం తప్పుకాదమ్మా. ఉన్న ఆస్తి పాస్తులన్నీ కట్టుకుపోలేం గద!" అన్నది వరలక్ష్మి.

వరలక్ష్మి ఆ మాట అన్నా సుభద్ర గ్రహించక, అత్తగారి దానధర్మాలకు చిరాకుపడుతూ వచ్చింది. చివరకు వరలక్ష్మి ప్రాణం విసిగి, "నువ్వు నీ పుట్టింటి నుంచి తెచ్చిన దేదీ నేను వృథా చెయ్యటం లేదులే, దిగులు పడకు," అన్నది.

గంగిశెట్టి శివకుమార్

ఇక అత్తగారిని మార్చటం తనవల్ల కాదని గ్రహించి, సుభద్ర తన మొగుడితో, "చూశారా, మీ అమ్మ ధోరణి? ఆవిడ ఇలాగే చేస్తుంటే మనకు చిప్ప చేతికి వస్తుంది. ముందు జాగ్రత్త పడటం తప్పా? మీరు ఆవిణ్ణి కాస్త హెచ్చరించండి," అన్నది.

"ఆవిడకు నువ్వూ, నేనూ చెప్పగల వాళ్ళమా?" అని చంద్రశేఖరుడు మొదట్లో భార్యమాట లక్ష్యపెట్టలేదు. కాని సుభద్ర అతని మనస్సుని అరగ దియ్యటం మానలేదు. చివరకు అతను తన భార్య దారిలోకి రానే వచ్చాడు.

"నువు చెప్పేది బాగానే ఉన్నది. కాని నన్ను ఏం చెయ్యమంటావు?" అన్నాడు చంద్రశేఖరుడు భార్యతో.

"రేపు మనకు పిల్లలు పుట్టుకు రావచ్చు. వాళ్ల మంచికోసమైనా మనం వేరేకాపురం పెట్టాలి," అన్నది సుభద్ర.

భార్య మాట విని చంద్రశేఖరుడు వేరు కాపురం పెట్టాడు. తరవాత కాల క్రమాన సుభద్ర ఒక కొడుకును కూడా కన్నది.

కొడుకు పుట్టినాక సుభద్రలో కలిగిన మార్పు చూసి చంద్రశేఖరుడు ఆశ్చర్య పోయాడు. ఆమె తన కొడుకుదే లోకంగా జీవిస్తూ, భర్తను కూడా మరిచిపోయింది.

ఒకనాడు సాయంకాలం చంద్ర శేఖరుడు ఇంటికి వచ్చేసరికి పొరుగింటి ఆమె సుభద్రతో మాట్లాడుతూ, పిల్లల



పెంపకంలో తీసుకోవలసిన జాగ్రత్తలు చెప్పి, చివరకు, "మనం ఎంతో కష్టపడి సాకుతాంగాని, పెద్దయి వీళ్లు మనని చూస్తారని ఏమీలేదు. అడ్డాలనాడు బిడ్డలుగాని, గడ్డాలనాడు బిడ్డలుకారని అందుకే అంటారు," అన్నది.

సుభద్ర ఆవేశంగా, "ఎవరైనా అలా అవుతారేమోగాని, నా బాబును అలా కానియ్యను. తల్లిదండ్రుల ఋణం తీర్చుకునే ఉత్తముడిగా వాణ్ణి తీర్చి దిద్దటానికి నా శాయశక్తులా ప్రయత్ని స్తాను. తల్లిదండ్రుల కష్టంమీద పెరిగి పెద్ద అయి, తన స్వార్థం తాను చూసు కునే శుంఠగా కానివ్వను వీణ్ణి!" అన్నది.

ఈ మాటలు విన్న చంద్రశేఖరుడు మర్నాడే వేరు కాపురం రద్దుచేసి, తమ తల్లి తమతో ఉండటానికి ఏర్పాటు చేశాడు.

"ఇదేమిటి ? మీ కేమైనా పిచ్చి పట్టిందా ?" అని సుభద్ర అతన్ని అడిగింది.

"లేదు, పట్టిన పిచ్చి వదిలింది సుభద్రా, నువు స్వార్థపరురాలివి. నీ కొడుకు తన స్వార్థం చూసుకునే శుంఠ కాకూడదుగాని, నీ భర్త అలాటి శుంఠ అయితే ఫరవా లేదన్నమాట! నేను శుంఠను కానని నిరూపించుకుంటు న్నాను," అన్నాడు చంద్రశేఖరుడు.

పొరుగింటావిడతో తాను కిందటి రోజు అన్న మాటలు గుర్తువచ్చి, సుభద్ర ఏమీ అనలేకపోయింది.

"చూడు, సుభద్రా! నువు నీ కొడుకును ఎంత గారాబంగా పెంచు కుంటున్నావో మా అమ్మ నన్ను అంత గారాబంగానూ పెంచి, నా మీద ఆశలన్నీ పెట్టుకున్నది. నా స్వార్థం నేను చూసు కుని, నా తల్లిని నిరాదరించటం తప్పు కదా ?" అన్నాడు చంద్రశేఖరుడు.

సుభద్ర పశ్చాత్తాపపడింది. తరవాత ఆమె తన అత్తగారితో ఎలాటి అరమ రికలూ లేకుండా కాపరం చేసింది.





# రాక్షసుడి బెడద

చిన్నడు తన కుక్కతోసహా ఒక పెద్ద కొండ సమీపానికి వచ్చాడు. దానికి కొద్ది దూరంలో కాంచనపురం అనే గ్రామం ఉన్నది. చిన్నడు కొండ దిగువన గుహవద్ద కూర్చుని విశ్రాంతి తీసుకుం టూండగా ఒక చిత్రం జరిగింది.

గ్రామం నుంచి ఒక మనిషి ఒక గాడిదనూ, ఒక మేకనూ తోలుకొని, గుహకేసి వచ్చాడు. గాడిదవీపున అన్నపు సంచులూ, కాల్చిన కోళ్లూ ఉన్నాయి. గుహ ముందుకు వస్తూనే ఆ మనిషి మేకను కూడా గాడిద మెడకు కట్టి, రెంటినీ గుహలోకి తోలి, తాను బయట నిలబడ్డాడు. గాడిద దాన్ని గుహలోకి ఈడ్చుకుపోయింది.

చిన్నడు ఆ మనిషితో, "గుహలో ఎవరు ఉంటున్నారు? ఎంత మంది వుంటున్నారు? అంత ఆహారాన్ని లోపలికి పంపించావే! నువు మాత్రం బయటే ఉండిపోయావేం?'' అన్నాడు.

ఆ మనిషి చిన్నడి కేసి ఒక్కక్షణం చూసి, "ఏముంది? మామూలు కథే! మా గ్రామానికి పట్టిన పీడ ఎప్పుడు వదులుతుందో మరి?'' అన్నాడు.

"నేను కొన్ని గ్రామాల పీడను వదిలించిన వాణ్ణే. మీ గ్రామానికి పట్టిన పీడ ఏమిటి? అసలు కథ ఏమిటో చెప్పు,'' అన్నాడు చిన్నడు.

దానికి ఆ మనిషి పకపకా నవ్వి, "ఇదేదో మంత్రాలకు లొంగేదైతే మా ఊరి పోతయ్య ఏనాడో వదిలించేవాడు. అతన్నే కబళించిన రాక్షసుణ్ణి నువు ఏం చెయ్యగలవు? ఈ రాక్షసుడు పూర్వం ఎప్పుడో ఈ కొండగుహలో ఉండి, మా ఊరి జనాన్ని విరుచుకు తిన్నాడట. అప్పుడు ఊరు పాడుబెట్టి జనం ఎటో

బూర్లె నాగేశ్వరరావు



టట్టూ ఏర్పాటు చేసుకువచ్చాడు. ఏ కాలంలోనూ రాక్షసులతో ఇంతకన్న మంచి ఏర్పాటు చేసుకున్నవారు లేరు గద! అందుచేత పోతయ్య చేసిన ఏర్పాటుకు గ్రామస్థులందరమూ సమ్మతించాం. అయితే రాక్షసుడు తన మాటమీద నిలబడక ఒక దుర్మార్గం చేశాడు. ఒకనాడు పోతయ్య కుటుంబమూ, అతని శిష్యులు నలుగురి కుటుంబాలూ దూర గ్రామంలో జాతర చూడటానికి బయలుదేరారు. తరవాత వాళ్ళ జాడలేదు. వాళ్లు కొండ పక్కగా వెళ్లాలి. రాక్షసుడు వాళ్ళను పట్టుకొని గుహలోకి ఈడ్చుకుపోయి, తినేసి వుంటాడని అనుమానం కలిగింది. పోతయ్య మండిపోయాడు. తాను ఎంతలావు పిశాచాలనూ గడగడలాడించగల వాడాయె! రాక్షసుడు ఇంత ద్రోహం చేశాడంటే సహిస్తాడా? తన శిష్యులను నలుగురిని వెంటబెట్టుకుని ఒకరోజు గుహలోకి వెళ్ళాడు. వాళ్లు మళ్లీ తిరిగి రాలేదు. రాక్షసుడు వాళ్ళను కూడా పొట్టన పెట్టుకుని వుండాలి. గ్రామస్థులందరమూ సభచేసి, రాక్షసుడికి రోజూ ఆహారం పంపుతూ, దేవుడిమీద భారంవెయ్య నిశ్చయించాం" అన్నాడు.

పోయారు. తరవాత ఒక సంవత్సరానికి వాళ్లు మెల్లిమెల్లిగా తిరిగివచ్చి, మామూలుగా జీవించసాగారు. రాక్షసుడి సంగతి అందరూ మరిచిపోయారు. ఇంతలో ఆరు నెలల కిందట మళ్లీ గ్రామంలో కోళ్లూ, గొర్రెలూ, మేకలూ మాయం కాసాగాయి. మసకవెన్నెల్లో పోతయ్య శిష్యులకు కొండమీద తాటిచెట్టు ప్రమాణాన రాక్షసుడు కనిపించాట్ట. పోతయ్య మహా ధైర్యం గలవాడులే. తాను ఒంటరిగా గుహలోకి వెళ్లి, రాక్షసుడితో మాట్లాడి, వాడికి గ్రామస్థులంతా వంతులప్రకారం ఆహారం రోజూ పంపేటట్టూ, వాడు గ్రామం చాయలకు రాకుండా ఉండే

చిన్నడు ఆలోచించినకొద్దీ ఈ రాక్షసుడి కథ అనుమానాస్పదంగా కనిపించింది. "రాక్షసుడు పోతయ్యనూ, అతని మనుషులనూ తినేసినాక, ఆ రాక్షసుణ్ణి ఎవరన్నా చూశారా?" అని అడిగాడు.

"లేదు. రాక్షసుడి పుణ్యమా అని వాడు ఇప్పుడు పాత ఏర్పాటును చక్కగా పాటిస్తున్నాడు." అన్నాడా మనిషి.

ఈ రాక్షసుడే అబద్ధం కావటానికి అవకాశం వుందని చిన్నడికి తోచింది. ఎప్పుడో ఎవరో మసకవెన్నెల్లో కొండ మీద చూశామన్నారు రాక్షసుణ్ణి. వాళ్లేమో రాక్షసుడి వాత పడ్డారట! నాలుగు కుటుంబాలను ఒక్క దెబ్బతో తినేసిన రాక్షసుడు అటుతరవాత ఎంతో బుద్ధిగా వుంటున్నాడు. ఇదంతా ఎలా నమ్మటం? రాక్షసుడు కల్పనే అయితే, ఆ సంగతి పోతయ్యకు తెలిసివుండాలి. రాక్షసుడు అబద్ధమైతే, పోతయ్యా అతడి అనుచరులూ గుహలో వున్నారన్నమాట! వారి కుటుంబాలు అదివరకే ఆ గుహలో చేరాయి. వారికి ఆహారం? ఊరి వాళ్లు రోజూ పంపిస్తున్నారు!

తన ఈ ఊహ నిజమనే నమ్మకంతో చిన్నడు తన కర్తవ్యం నిర్ణయించుకుని, తన కుక్కతో గ్రామం చేరాడు.

ఆ రాత్రి వాడు కటికచీకట్లో కొండను



చేరి గుహబయట ఆలకిస్తూ నిలబడ్డాడు. లోపల చాలామంది వున్నట్టు అలికిడి వినిపించింది. చిన్నడు పిల్లిలా లోపలికి వెళ్ళాడు. గుడ్డిదీపంవెలుగులో పదిహేను, ఇరవైమంది మగవాళ్ళూ, ఆడవాళ్ళూ, పిల్లలూవున్న సంగతి అస్పష్టంగా కనబడింది. వాళ్ళంతా మాంసం పీక్కు తింటున్నారు. రాక్షసుడిజాడ ఏమీలేదు.

మర్నాడు చిన్నడు గ్రామంలోని కుర్రకారును పిలిచి, "నిన్న రాత్రి గుహలోకి వెళ్ళాను. అందులో చాలా మంది రాక్షసు లున్నమాట నిజమేగాని, వాళ్లు భయంకరమైనవాళ్లు కారు. అలాటి రాక్షసులను చాలామందిని నేను ఆట

కట్టించాను. వీళ్ళకోసం మీరు కడుపులు కట్టుకుని ఆహారం పంపటం శుద్ధ తెలివి తక్కువ,'' అన్నాడు.

చిన్నడి మాటలు విని యువకులకు ప్రాణం లేచివచ్చినట్టయింది. చిన్నడు వాళ్ళతో ఇంకా ఇలా అన్నాడు:

''చూడండి! నేను చెప్పిన ఈ సంగతి మీరే గ్రహించి వుండవలసింది. ఒక్కసారి మనిషిమాంసం రుచి చూసిన రాక్షసుడు గాని, అడవిమృగం గాని కోళ్ళతోనూ, గొర్రెలతోనూ సరిపెట్టుకోదు. కాని గుహలో ఉండే రాక్షసులు మనుషుల కోసం గుహవిడిచి రావటం లేదు. ఎవరి కంటా పడటంలేదు. ఇప్పుడు మన పని ఈ రాక్షసులను వేటాడటం! అందుకు పెద్ద ప్రయత్నం ఏమీ అవసరం లేదు. పదండి, గుహద్వారానికి పచ్చి కట్టెలు అడ్డంగాపేర్చి అంటించి, రాక్షసులకు ఊదర పెట్టుదాం. రాక్షసులు ఉక్కిరిబిక్కిరి అయి బయటికివస్తారు.''

చిన్నడు చెప్పిన కార్యక్రమం క్షణాలమీద అమలు జరిగింది. గుహద్వారం నిలువునా కట్టెలు పేర్చి అంటించారు. లోపలివాళ్ళకు ఊపిరి ఆడక, కాలేకట్టెలను తోసుకుంటూ బయటికి వచ్చారు. రాక్షసులు వస్తారని ఎదురు చూస్తున్న గ్రామస్థులు పోతయ్యానూ, అతని మనుషులనూ, ఆడవాళ్ళనూ, పిల్లలనూ చూసి స్తంభించిపోయారు.

''చూశారా, వీళ్ళంతా మీకు తెలిసిన రాక్షసులే. ఎప్పుడో ఒక రాక్షసుడు ఇక్కడికి వచ్చాడన్న కథ ఆధారం చేసుకుని వీళ్లు గ్రామాన్ని ఈ విధంగా దోచి బతకటానికి ఎత్తువేశారు,'' అన్నాడు చిన్నడు.

పోతయ్యకూ, అతని అనుచరులకూ ఇంక తమ గ్రామస్థుల ఎదుట ఉండటానికి మొహంచెల్లక, తమ కుటుంబాలతో సహా ఎటో వెళ్ళిపోయారు.

తరవాత చిన్నడు ఊరివాళ్ళ దగ్గర సెలవు పుచ్చుకుని, మరో గ్రామానికి బయలుదేరాడు.



# తేడా

మహామంత్రి తిమ్మరుసు ఇంట్లో ఇద్దరు సేవకులు పనిచేసేవారు. ఇద్దరూ విశ్వాసపాత్రులు. ప్రతి ఏడూ తిమ్మరుసు వారి జీతం ఇరవై వరహాలు పెంచేవాడు.

ఒక ఏడు ఆయన ఒకడికి మామూలు ప్రకారం ఇరవై వరహాలు పెంచి, రెండోవాడికి నలభై పెంచాడు. మొదటివాడు ఏమీ అనలేదు గాని, హెచ్చు జీతం తీసుకున్నవాడు తిమ్మరుసును తేడాకు కారణం అడిగాడు.

"నీలో పరోపకారబుద్ధి ఉన్నది. వాడిలో లేదు," అన్నాడు తిమ్మరుసు.

"ఆ సంగతి మీ కెలా తెలును?" అన్నాడు సేవకుడు.

"నిన్న రాత్రి ఒక బిచ్చగాడు వాడి ఇంటికి వెళ్ళి పట్టెడన్నం పెట్టమని కోరగా వాడు చీదరించుకుని పంపేశాడు. తరవాత వాడు మీ ఇంటికి రాగా, నువు వాడికి కడుపునిండా అన్నంపెట్టి, పాతబట్టలు కూడా ఇచ్చావు. అందుచేత నీకు పెంచిన జీతం దానధర్మాలకు ఉపయోగపడుతుంది," అన్నాడు తిమ్మరుసు.

"ఇది నిజమే, కాని మీకెలా తెలిసింది?" అని సేవకుడు ఆశ్చర్యంగా అడిగాడు.

"ఆ బిచ్చగాణ్ణి నేనే!" అన్నాడు తిమ్మరుసు. —మల్లాది వెంకటకృష్ణమూర్తి.






ఒకప్పుడు విదర్భదేశం పశ్చిమ ప్రాంతంలో అతివృష్టి కలిగి అనేక గ్రామాలు దెబ్బతిన్నాయి. జననష్టం కూడా జరిగింది. ఆ దేశపు రాజు ప్రజలకు సహాయంచేసే ఉద్దేశంతో జీవన్న అనేవాడి ద్వారా దెబ్బతిన్న ప్రాంతాలకు చాలా ధనం పంపాడు.

జీవన్న ఒక కొండప్రాంతం చేరుకునేసరికి అక్కడ అతనికి గంగులు అనేవాడు కనిపించాడు. ఈ గంగులు దొంగతనం వృత్తిగా గలవాడు. లోగడ దొంగతనం చేసి పట్టుబడి, కారాగారవాస శిక్ష కూడా పొంది ఉన్నాడు. ఆ సమయంలో జీవన్న ఏకారణం చేతనో గంగులుకు కారాగృహంలో రహస్యంగా కొన్ని సౌకర్యాలు కూడా కలిగించాడు.

గంగులు ఆ విశ్వాసంవల్ల జీవన్నను చూడగానే దణ్ణం పెట్టి, ఆ రోజు తన ఇంటికి అతిథిగా రమ్మని ప్రాధేయపడ్డాడు. జీవన్న అందుకు ఒప్పుకున్నాడు. నిర్జన ప్రాంతంలో ఒక కుగ్రామంలో జీవన్నకు ఆతిథ్యం దొరకటమేగాక, గంగులును చూడగానే జీవన్నకు ఒక లాభసాటి ఆలోచన వచ్చింది. గంగులు తాను చెప్పినట్టు చేస్తే జీవన్న తన దగ్గిర ఉన్న రాజధనాన్ని సొంతం చేసుకోవచ్చు.

గంగులుకు చుక్క అనే కూతురు ఉన్నది. జీవన్నకు ఆమె వంట చేసి పెట్టింది. జీవన్న గంగులుకు తన ఆలోచన చెప్పి, ''నేను నీ కూతురిని పెళ్ళాడ నిశ్చయించుకున్నాను. ఆ కారణంచేత నువ్వు నాకు మామగారివి అవుతావు గనక నిన్ను సాధ్యమైనంత త్వరగా కారాగృహం నుంచి బయటపడేయించే మార్గం చూస్తాను,'' అన్నాడు.

చెల్లూరి సీతారాజేశ్వరరావు

జీవన్న చెప్పినట్టు చేయ్యడానికి గంగులు ఒప్పుకున్నాడు.

జీవన్న తన బట్టలు చించుకుని, ఒంటిమీద అక్కడక్కడా చిన్న చిన్న గాయాలు చేసుకుని, రాజుగారి వద్దకు వెళ్ళి, ఫలాన కొండ ప్రాంతంలో గంగులు అనే దొంగ తన అనుచరులతో తనమీదపడి, తనను చావగొట్టి రాజుగారు తన చేతికి ఇచ్చిన డబ్బంతా దోచుకున్నట్టు ఫిర్యాదు చేశాడు.

రాజు వెంటనే భటులను పంపి గంగులును పట్టి తెప్పించాడు. రాజభటులనుంచి తప్పించుకునే ప్రయత్నం ఏదీ చెయ్యకపోగా, గంగులు తనకోసం భటులు వచ్చినందుకు ఆశ్చర్యంకూడా కనబరచలేదు. వాడు అంత తేలికగా పట్టుబడటం రాజును ఎక్కువగానే ఆశ్చర్యపరచింది. గంగులు ఇటీవల చాలా డబ్బు వచ్చినవాడిలాగా గాని, తన కింద పెద్ద బలగం ఉన్నవాడిలాగా గాని కనిపించనుకూడాలేదు. ఇదంతా రాజు గమనించాడు. ఏమైనా రాజు వాణ్ణి బహిరంగంగా విచారించి ఉరిశిక్షకూడా ప్రకటించాడు.

గంగులుకు ఉరిశిక్ష పడినట్టు తెలియగానే జీవన్న పెద్ద భారం దిగిపోయినట్టు భావించి, గంగులు కూతుర్ని పెళ్ళాడే ఉద్దేశం అతనికి ఏకోశానా లేనికారణం చేత, తనకోసం వచ్చిన చుక్కను నౌకర్ల చేత గెంటించి, ఒక ధనికుడి కూతుర్ని



పెళ్ళాడే ఏర్పాటు చేసుకుని, పెళ్ళి ప్రయత్నాలలో నిమగ్నుడయాడు.

అతను ఈ ప్రయత్నాలలో ఉండగానే గంగులు అకస్మాత్తుగా ఊడిపడ్డాడు.

''ఇంత ద్రోహం చేస్తావా ? నా కూతురిని తన్ని తగిలేస్తావా ? నిన్ను ఏం చేస్తానో చూడు !'' అంటూ.

జీవన్న హడిలిపోయి, '' ఈ పెళ్ళి ప్రయత్నమంతా చుక్కను పెళ్ళాడ టానికే! ఇంకెందుకు అనుకున్నావు? ఇంతకూ నువ్వు ఉరిశిక్షనుంచి ఎలా తప్పించుకువచ్చావు?'' అని గంగులును అడిగాడు.

''ఈ ముసలివాడి సహాయంతో బయట పడ్డాను," అని తన వెంట ఉన్న ముసలివాణ్ణి చూపి, ''నేను నీ మాట నమ్మను. నా వాటా డబ్బు నా కిచ్చెయ్యి.'' అన్నాడు గంగులు.

''ఏమిటి మీ వాటా ఒప్పందం?'' అని ముసలివాడు జీవన్నని అడిగాడు.

జీవన్న తమ ఒప్పందమంతా చెప్పి, ''నేను చుక్కని పెళ్ళాడకపోవటం పొరపాటే. నన్ను క్షమించాలి,'' అన్నాడు.

వెంటనే ముసలివాడు జీవన్న చేతులకు సంకెళ్ళు తగిలించి, తన వేషం విప్పాడు. మహారాజు!

జీవన్నకు మతిపోయింది.

మహారాజు ఇలా అన్నాడు:

''గంగులు మరీ తేలికగా పట్టుబడటంతో నాకు అనుమానం కలిగింది. అందులో నీ పాత్ర కూడా ఉండవచ్చునేమో ననిపించింది. గంగులుకు ఉరిశిక్ష ప్రకటించగానే వాడు అంతా చెప్పేశాడు. వాడు చెప్పినది నిజమని నీ నోటిమీదుగానే చెప్పావు. గంగులులాటి దొంగల కన్న నీలాటి కనపడని దొంగల వల్ల చాలా ప్రమాదం ఉన్నది. నీలాటి వారిని ముందు ఏరి పారేస్తేగాని రాజ్యం బాగుపడదు.''






రక్షకభటుడు రంగయ్యకు విపరీతంగా ఒళ్లు పెరిగిపోయింది. అతని పని రాత్రి వేళ గస్తీ తిరగడం. అయితే అతను పరిగెత్తి దొంగను పట్టలేడు.

''ఈ మధ్య నువు ఎటువంటి నేరస్థుణ్ణీ పట్టుకోలేదేం?'' అని పైఅధికారి అడిగితే, తనను చూస్తే నేరస్థులకు హడలు అనీ, నేరాలు తగ్గిపోయాయనీ జవాబు చెప్పాడు రంగయ్య. కాని ప్రజలు ఫిర్యాదులు చేస్తూనే ఉన్నారు; రంగయ్య చివాట్లు తింటూనే ఉన్నాడు. ఎలాగైనా సాధించి ఒక నేరస్థుణ్ణి పట్టుకుని, పై అధికారి మెప్పు పొందాలని రంగయ్య ఆలోచన.

నేరస్థులను పట్టుకుంటే రంగయ్యకు ఇంకోవిధంగా కూడా లాభిస్తుంది. అతను రాబోయే పండగకు భార్యకు చంద్రహారం చేయిస్తానని మాట ఇచ్చి, అందు కోసం మూడువందలు చేర్చిపెట్టాడు కూడా. ఎవడన్నా నేరస్థుడు తనకు చిక్కి, రెండువందలు ఇచ్చుకుంటే, రంగయ్య భార్యకు చంద్రహారం అమరుతుంది.

రంగయ్య రాత్రివేళ చేతిలో కర్ర ఊపుకుంటూ, ఊరి చివర ఉన్న శివాలయంకేసి వచ్చాడు. చీకట్లో, శివాలయం అరుగుమీద ఎవరో నక్కి ఉన్నట్టు కనిపించింది.

''ఎవడ్రా వాడు? ఇంత రాత్రివేళ ఇక్కడ నీకేం పని?" అని రంగయ్య గద్దించాడు.

పదిహేనేళ్ల కుర్రవాడు భయపడుతూ రంగయ్యను సమీపించాడు. రంగయ్య వాడి మెడ ఒడిసి పట్టుకుని, ''ఎవడివిరా నువు? దొంగలాగున్నావు!'' అంటూ చేతిలో కర్ర పైకెత్తాడు.

మాచిరాజు కామేశ్వరరావు



''నేను దొంగను కాదు, బాబోయ్! మా నాన్న చంపేస్తాడని భయపడి, ఇక్కడికి వచ్చి దాక్కున్నాను,'' అన్నాడు కుర్రవాడు హడలిపోతూ.

''మీ నాన్న నిన్ను చంపడం ఏమిటి?" అని రంగయ్య ఆశ్చర్యంగా అడిగాడు.

''అదేమో నాకు తెలియదు. చీకటి పడి ఇంటికి వచ్చాను. 'మీ నాన్న నిన్నూ, నన్నూ చంపేస్తాడు. ఎలాగైనా పారిపో,' అన్నది మా అమ్మ. మా నాన్న లోపలి గదిలో కత్తి నూరుతున్నాడు. నేను పారి పోయి వచ్చి, ఇక్కడ కూర్చున్నాను,'' అన్నాడు కుర్రవాడు.

రంగయ్యకు తన కర్తవ్యం గుర్తుకు వచ్చింది. ఒక హంతకుడి చేతిలో ఒక అమాయిక ప్రాణి బలికాకముందే తాను కాపాడాలి!

రంగయ్య ఆ కుర్రవాడికి ధైర్యం చెప్పి, వాడివెంట వాడి ఇంటికి బయలు దేరాడు. దొంగని దొంగతనం చేస్తూండగా పట్టుకోవాలి; హంతకుణ్ణి హత్య చేయక ముందే పట్టుకోవాలి.

''మనం రహస్యంగా లోపలికి వెళదాం,'' అన్నాడు రంగయ్య. కుర్ర వాడు పెరటి గోడమీదికి చెంగున ఎగిరి లోపలికి దూకాడు. రంగయ్య అతి కష్టం మీద పెరటిగోడమీదికి ఎక్కగానే, వానలకు తడిసివున్న ఆ మట్టిగోడ విరిగి లోపలికి పడింది. రంగయ్యకు నడుము విరిగినంతపని అయింది.

ఇంటిలోపల ఏదో పెద్ద అలికిడీ, 'చంపకు! చంపకు!' అన్న కేకా విని పించింది. హంతకుణ్ణి పట్టుకోబోతున్న ఉత్సాహంతో రంగయ్య చప్పున లేచి, పెరటివాకిలి చేరి తలుపు నెట్టాడు. తలుపు లోపల గడియపెట్టి ఉన్నది. రంగయ్య బలంగా తోసేసరికి, పాత తలుపు పెళపెళావిరిగి, లోపలికి పడి పోయింది.

ఆత్రంగా లోపలికి వెళ్ళిన రంగయ్య అక్కడి దృశ్యం చూసి నిర్ఘాంత

పోయాడు. కుర్రవాడి తల్లి మంచంమీద కూర్చుని ఉన్నది. తండ్రి ఒక కర్రతో చిట్టెలుకను చంపుతున్నాడు.

ఎలుకను చంపిన కర్రను పక్కకు పడేసి, "రక్షకభటుడివై ఉండి, ఏమిటీ దౌర్జన్యం? వీధితలుపు తట్టితే తలుపు తియ్యమా? తలుపులు బద్దలు కొట్టుకుని వచ్చావేమిటి?" అని కుర్రవాడి తండ్రి అడిగాడు.

"నువు నీ భార్యను చంపకుండా రక్షించటానికి వచ్చాను." అన్నాడు రంగయ్య.

కుర్రవాడి తండ్రి రెచ్చిపోయి, "మర్యాదగా మాట్లాడు! నేను నా భార్యను చంపడమేమిటి? తెల్లవారనీ, నీ మీద నీ పై అధికారికి ఫిర్యాదు చేస్తాను." అన్నాడు.

రంగయ్య తెల్లబోయి, జరిగినది చెప్పాడు.

అసలు జరిగినది ఏమిటంటే, ఆ కుర్రవాడు తల్లిదండ్రులకు లేక లేక పుట్టాడు. తండ్రి మంగలి. కుర్రవాడు బొత్తిగా మందమతి. తండ్రి వాడికి కుల వృత్తి నేర్పలేకపోయాడు. వాడికి ఏ పనీ రాదని నిర్ణయించి, తండ్రి వాడికి ఏ పనీ చెప్పడం మానేశాడు.

ఇల్లు బొళ్లు కొంప అయిపోయింది,



వచ్చే పండగకు సున్నం కొట్టించాలి. కొత్తబట్టలు కొనుక్కోవాలి. అందుకోసం గేదెను సంతలో అమ్మి డబ్బు తెస్తానన్నాడు కుర్రవాడి తండ్రి.

అయితే అనుకున్న ప్రకారం అతను, ఒంట్లో సుస్తీగా ఉండి, మర్నాడు సంతకు వెళ్ళలేకపోయాడు.

తన కొడుకు బొత్తిగా అప్రయోజకుడు కాడని నిరూపించటానికి తల్లి వాణ్ణి సంతకు పంపి, గేదెను అమ్మింతామన్నది.

"వాడు సరిగా పనిచేసుకు రాక పోయాడో, అప్పుడు వాడి పనీ, నీ పనీ చెబుతాను," అని తండ్రి కొడుకుతో, "సంతలో గేదె ధర నూటపాతిక

రూపాయలని చెప్పు, ఆఖరికి నూరు రూపాయలకైనా ఇచ్చెయ్యి. అంతకూడా రాకపోతే, అమ్మకుండా ఇంటికి వచ్చెయ్యి.'' అన్నాడు.

కుర్రవాడు గేదెను తోలుకుని సంతకు వెళ్ళాడు. దానికి ఎవరూ వంద రూపాయలు ఇస్తామని ముందుకు రాలేదు. సాయంత్రందాకా చూసి, కుర్రవాడు ఇంటికి వచ్చేశాడు.

''గేదెను ఎంతకు అమ్మావురా ?'' అని తల్లి వాణ్ణి అడిగింది.

''అమ్మలేదు. దానికి ఎవరూ వంద రూపాయలు ఇయ్యలేదు,'' అన్నాడు కొడుకు.

"మరి గేదె ఏదీ ?'' అని తల్లి అడిగింది.

''అమ్మకపోతే ఇంటికి వచ్చెయ్యమన్నాడు నాన్న. గేదెను ఇంటికి తోలుకు రమ్మనలేదే !'' అన్నాడు కొడుకు.

తల్లి గుండెలు బాదుకుని, ''మీ నాన్న నిన్నూ, నన్నూ చంపేస్తాడు. ఎటైనా పారిపో !" అన్నది.

కుర్రవాడు లోపలిగదిలోకి చూస్తే, తండ్రి మర్నాడు పనికోసం కత్తి నూరుకుంటూ కనిపించాడు. వాడు పారిపోయి, శివాలయంలో నక్కాడు.

''వెర్రిబాగులవాడి మాటలు నమ్మి నిక్షేపంలాంటి గోడా, తలుపూ పడగొట్టావు ఉండు ! తెల్లవారగానే నీ ఉద్యోగం ఊడగొట్టించేస్తాను,'' అన్నాడు కుర్రవాడి తండ్రి.

''బాబ్బాబు ! మీకు పుణ్యం ఉంటుంది. నా పొట్ట కొట్టకండి. నష్ట పరిహారం ఇచ్చుకుంటాను,'' అని రంగయ్య అప్పటికప్పుడే ఇంటికి వెళ్ళి, తన భార్య చంద్రహారం కోసం దాచి ఉంచిన మూడువందలూ తెచ్చి కుర్రవాడి తండ్రికి ఇచ్చాడు.

ఆ డబ్బుతో వాళ్లు ఇల్లు బాగు చేయించుకుని, సున్నం కొట్టించుకుని, కొత్తబట్టలు కొనుక్కుని, మరొక గేదెను కూడా సంపాదించుకున్నారు.





# నేర్చుకోరాని పాఠాలు

ఒక ఊళ్ళో కామయ్యా, కామమ్మ అనే దంపతు లుండేవారు. వారికి సోము అనే కొడుకు ఉండేవాడు. కామయ్య పొద్దస్తమానమూ శ్రమించి, కుటుంబాన్ని పోషించుతూ వచ్చాడు.

ఒక రోజున, పొరుగున ఉన్న దానయ్య వచ్చి, ''కామయ్యా, రోజల్లా ఒళ్ళు హూనం అయేటట్టు పనిచేస్తావు కదా ? శివాలయంలో శాస్త్రులుగారు పురాణం చెబుతున్నారు, వెళదాం రావయ్యా, కాలక్షేపంగా ఉంటుందీ,'' అన్నాడు.

కామయ్యకు పురాణాల గొడవ ఏమీ తెలీదు. అతని జీవితమంతా పశువుల తోటీ, పొలంలోనూ గడిచిపోయింది. దానయ్య మాట తీసివేయలేక అతను పురాణం వినబోయాడు.

ఆ రోజు పురాణం శాస్త్రులు స్వర్గం గురించి చెప్పాడు. మర్నాడు కామయ్య తాగి, ఇంటికి వచ్చాడు. ఎన్నడూ వక్క పలుకైనా నోటవేసుకోని తన భర్త తాగిరావటం చూసి, కామమ్మ నిర్ఘాంత పోయింది. అందుచేత ఆమె ఈ విషయం నిష్ఠురమాడింది.

కామయ్య నవ్వి, ''ఓసీ, వెర్రిదానా ! పురాణం వినకముందు నేనూ నీలాగే అనుకునేవాణ్ణి. కాని పురాణంలో దేవతలంతా తాగుతారని ఉన్నది,'' అన్నాడు.

కామమ్మకు ఏమనాలో తోచలేదు.

మర్నాడు కామయ్య సోమును కూడా పురాణం వినడానికి తీసుకువెళ్ళాడు. ఆ రోజు పురాణంలో ఇంద్రుడు సగరుడి గుర్రాన్ని అపహరించడం ఉన్నది.

తరవాత కామమ్మ చిల్లర డబ్బుల కోసం పోపుల డబ్బాలో చూస్తే, డబ్బు లేదు. తీస్తే తన భర్త తీయాలి, లేదా కొడుకు తీయాలి. భర్త చెప్పకుండా

మారుపాక సంధ్యారాణి

డబ్బు తీయడు. కొడుకు అసలే తీయడు. ఆమె సాయంత్రం కామయ్యను అడిగితే, "నేను తీయలేదే, నువ్వే మరెక్కడన్నా పెట్టావేమో !" అన్నాడు.

సోము ఆ రాత్రి అన్నం తింటూ "కాశీపట్నం" గురించి తెగచెబుతున్నాడు. మధ్యలో కామమ్మ, "నీకు డబ్బు ఎక్కడిదిరా ? నన్నడిగి తీసుకోలేదే ?" అన్నది.

"పోపు డబ్బాలో నుంచి డబ్బులు తీసుకున్నా," అన్నాడు సోము.

"ఎందుకు చేశావురా ఈ పని ? దొంగతనం మన ఇంటా వంటా లేదే ?" అన్నది కామమ్మ బాధగా.

"ఇంద్రుడు దొంగతనం చెయ్యలేదా, అమ్మా ? నేను చేస్తే తప్పయిందా ?" అని సోము అడిగాడు.

తరవాత రెండు రోజులకు పురాణంలో ఏం విన్నారోగాని, కామయ్య పొలానికి పోలేదు, పొద్దస్తమానమూ హరినామ స్మరణ చేయసాగాడు.

అతను పొలానికి పోకపోతే ఇల్లు గడవదు. అందుచేత కామమ్మ తన మొగుడికి బుద్ధి చెప్పాలనుకున్నది.

ఎప్పటిలాగా స్నానంచేసి, కామయ్య హరినామస్మరణ చేస్తూ, భార్య భోజనానికి పిలవడం కోసం ఎదురుచూస్తున్నాడు. కాని ఎంతకూ పిలుపు రాలేదు. తండ్రి, కొడుకులు లోపలికి వెళ్లి చూసేసరికి కామమ్మ పూలుగుచ్చుతూ కనిపించింది.

కామయ్య కోపంతో, "ఇప్పుడు నీకు పూలకు తొందర వచ్చిందా ? వంటైనా వండలేదే !" అన్నాడు.

కామమ్మ నవ్వి, "శచీదేవి ఎప్పుడూ తన భర్తను పూలదండలతో పూజిస్తుందట. ఆమె వంటచేసినట్టు పురాణంలో ఎక్కడా లేదే !" అన్నది.

దానితో కామయ్యకూ, సోముకూ పురాణం మత్తు వదిలింది. వాళ్లు మామూలు మనుషులైపోయి, దేవతలతో సామ్యం పెట్టుకోవటం మానేసి, తిరిగి సుఖంగా జీవించసాగారు.





# అత్తగారూ-కొత్తకోడలు

కుముదిని కొత్తగా కాపరానికి వచ్చింది. ఆమె భర్త శచీంద్రుడు. తనను తన అత్త రాచిరంపాన పెట్టుతుందని కుముదిని అనుకున్నది. కాని తీరా ఆమె అత్తవారింట అడుగుపెట్టే సరికి ఆమెకు అమితమైన ఆశ్చర్యం కలిగింది. కుముదిని అత్తగారు నవ్వుతూ ఎదురు వచ్చి, లోపలికి తీసుకుపోయింది. ఒకటి రెండు రోజులు గడచినా అత్త గారిలో మార్పులేదు. ఆమె తన కోడలిని కూతురు కన్న ఎక్కువగా చూసుకుంటున్నది.

అయినా కుముదినికి అనుమానం పోలేదు. కొంతమంది మొదట ఎంతో ఆప్యాయంగా ఉండి, కాలక్రమాన అసలు రంగు బయట పెట్టుకుంటారులే అనుకున్నదామె.

శచీంద్రుడు పొద్దున్నే ఇంత చద్ది తిని, పొలానికి వెళ్ళి, తిరిగి చీకటిపడ్డాక ఇల్లు చేరేవాడు. కాపరానికి వచ్చిన దగ్గిర నుంచీ తన పనులన్నీ భార్యే చేస్తూండటం చూసి, తన తల్లికి పనిభారం తగ్గి ఉంటుందనుకున్నాడు శచీంద్రుడు.

ఒకరోజు రాత్రి అతను తన భార్యను ఆటపట్టించాలనుకుని, భోజనం చేస్తూ, "ఇవాళ నీకు ఏమయింది? వంటంతా ఇలా తగలేశావు?" అన్నాడు.

రోజూ వంటను మెచ్చుకుంటూ అన్నం తినేవాడు ఇవాళ ఈ మాట అనేసరికి, కుముదిని, "ఇవాళ నీకే ఏదో అయింది. రోజూ వంట చేసే మీ అమ్మే ఇవాళ కూడా చేసింది." అన్నది.

శచీంద్రుడి మనస్సు చివుక్కుమన్నది. "రోజూ అమ్మే వంట చేస్తున్నదా? నువు కాస్త ఆవిడకు సహాయపడగూడదూ?" అన్నాడతను.

వీరేపల్లి జయరాంరెడ్డి

''అంటే, రోజూ నేను కుడిచి కూర్చుంటున్నాననేగా మీ ఉద్దేశం? ఇదే మా ఇంట్లో అయితే ఇటు చెంబు అటు పెట్టే పనికూడా ఉండదు,'' అన్నది కుముదిని రోషంగా.

శచీంద్రుడికి ఒళ్ళు మండి, ''అలా అయితే పుట్టింటనే ఉండలేకపోయావా? ఇక్కడి కెందుకు రావటం?'' అని చివాలున లేచి పోయాడు.

కుముదినికి ఏడుపొచ్చింది. మొగుడి చేత అంత మాట పడినాక ఆమెకు అక్కడ ఉండబుద్ధి కాలేదు. ఆమె పుట్టింటికి బయలుదేరింది. అత్తగారు కోడలికి కన్నవారి మీద గాలి మళ్ళింది కాబోలు ననుకుని సాగనంపింది.

కుముదిని పుట్టిల్లు చేరుతూనే తల్లిని కౌగలించుకుని, ''నేనిక అక్కడికి పోను. అక్కడ నాకు వీసమెత్తు విలువలేదు,'' అని ఏడ్చింది.

''పోనీలే, తల్లీ, ఇక్కడే ఉండు. అల్లుడికి బుద్ధి రాకపోదు,'' అన్నది తల్లి.

కుముదినికి మహేంద్రుడనే అన్న ఉన్నాడు. అతని భార్య వినోదిని కాపరానికి వచ్చి ఉన్నది.

ఇంటి పని అంతా వినోదినే చేస్తూండటం చూసి కుముదిని కొంచెం బాధపడి, ''వంటమనిషి ఏమయింది?'' అని తల్లిని అడిగింది.

''మానిపించాను. ఇంకో మనిషి ఇంటోకి వచ్చినాక వంటమనిషి దేనికి? ఇంతలో వినోదిని అరిగిపోదులే,'' అన్నది కుముదిని తల్లి.

తెల్లవారుతూనే, తన తల్లి వినోదినిని లేవగొట్టటమూ, ఊపిరి సలపకుండా పనులు చెప్పటమూ కుముదిని చూసింది. సాటి ఆడపిల్ల గొడ్డులాగా కష్టపడుతుంటే కుముదినిక కంపరం పుట్టుకొచ్చింది.

ఆమె తన తల్లిని నానా మాటలూ అని, తన వదినను తన తల్లి సరిగా చూడని పక్షంలో తాను తిరిగి తన పుట్టింటి గడప తొక్కనని బెదిరించి, అత్తవారింటికి బయలుదేరి పోయింది.





ద్వాపర యుగంలో యదువంశంలో కృష్ణుడు జన్మించి, కంసాది దుష్టులను నిర్మూలించి, ద్వారకానగరంలో ఎనమండుగురు దేవేరులతో తులతూగుతున్నాడు. అతని అన్న బలరాముడు యాదవుల నాయకుడై రాజ్యపాలన చేస్తున్నాడు.

కృష్ణుడు సత్యభామతో కూడా వెళ్ళి, నరకాసురుణ్ణి సంహరించాడు. సత్యభామ కూడా యుద్ధంచేసి కృష్ణుడికి తోడ్పడింది. అప్పట్నించి సత్యభామకు కృష్ణుడి అష్టమహిషుల్లో తానే అధికురాలననే గర్వం ఏర్పడింది.

నారదుడు ఒకనాడు దేవలోకంలోని పారిజాతపుష్పాన్ని తెచ్చి రుక్మిణికి ఇచ్చాడు. కృష్ణుడికి నిజమైన భార్యను నేనై ఉండగా, నా సవతి రుక్మిణికి ఇవ్వడ మేమిటి? అని సత్యభామ అలిగింది.

కృష్ణుడు తనతోబాటు సత్యభామను గరుత్మంతుడి మీద ఎక్కించుకొని, దేవలోకానికి వెళ్ళి, పారిజాత వృక్షాన్నే పెకిలించి పట్టుకుపోతూంటే, ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని గరుడవాహనం మీదకు విసిరాడు. గరుత్మంతుడు వజ్రాయుధాన్ని తన రెక్కతో అడ్డుకొని విదల్చి పారేశాడు. అప్పట్నించీ గరుత్మంతుడు విపరీతంగా గర్వించసాగాడు. సత్యభామ పారిజాతవృక్షాన్ని తన పెరట్లో నాటించుకొని, మరీ గర్వించిపోయింది.

46. కృష్ణాంజనేయ యుద్ధం



బలరాముడు కూడా మహాబలులైన అనేకమంది దుర్మార్గులనూ, నరకాసురుడి ప్రాణమిత్రుడైన ద్వివుడు అనే మహా భయంకరుడైన తోకలేని నరవానరుణ్ణీ, తన సాటిలేని నాగలి ఆయుధంతో సంహరించి, తన బలపరాక్రమాలకు అతిగా గర్వించసాగాడు.

సత్యభామ, గరుత్మంతుడు, బలరాముడు, యీ ముగ్గురూ రోజు రోజుకూ మరీ గర్వాన్ని పెంచుకుపోతూంటే, కృష్ణుడు చిరునవ్వుతో సమయం కోసం నిరీక్షిస్తూ ఉన్నాడు.

గరుత్మంతుడు ఒకనాడు ఒక నాగుల పసివాణ్ణి కబళించాలని పట్టుకోబోతే, ఆ పసివాడి తల్లి కాంచనహేల అనే నాగిని పరుగున వచ్చి బిడ్డణ్ణి ఎత్తుకొని పారిపోయింది. గరుత్మంతుడు వెంట తగిలాడు. "రక్షించండి! రక్షించండి!" అని అరుస్తూ రొప్పుకుంటూ వస్తూన్న నాగినికి నారదుడు ఎదురై, "రామనామం వల్లిస్తూ హనుమంతుడి శరణుపొందు! మిమ్మల్ని రక్షించగలవాడు అతనొక్కడే! గంధమాదనపర్వతం మీద తపస్సు చేసుకుంటున్నాడు, త్వరగా వెళ్లు!" అని చెప్పాడు.

కాంచనహేలకొడుకును హనుమంతుడి పాదాలమీద వేసి, "రక్షించు! రామ, రామ!" అంటూ కూలిపోయింది.

హనుమంతుడు కళ్ళు తెరిచి, "నా ఆశ్రమంలో నిర్భయంగా ఉండండి!" అని అభయమిచ్చాడు.

గరుత్మంతుడు వాళ్ళను పట్టి తినడానికి అక్కడికి రావడం చూసి, "ఓ పక్షీంద్రమా! నీకు ఆకలిగా ఉంటే నన్ను పొడుచుకొని తిను!" అని హనుమంతుడు అన్నాడు.

"నాగులు నా ఆహారం! నువ్వు కోతివి, పనికిరావు!" అంటూ గరుడుడు హుంకరించి ఆశ్రమంలో వున్న తల్లి బిడ్డలను పట్టుకోబోతూంటే హనుమంతుడు తన తోకతో గరుత్మంతుడి రెక్కలు విరిచికట్టి,

ఆకాశానికి ఎత్తి గిర గిరా తిప్పి విసిరేశాడు. ఆ విసురుకి గరుత్మంతుడు ద్వారకానగరంలో బలరాముడి ముందు దెబ్బతిన్న పిట్టలాగ పడ్డాడు.

కాంచనహేల హనుమంతుడికి నమస్కరించి, కుమారుడితో సురక్షితంగా పాతాళంలోని నాగలోకంలో వున్న, అన్న వాసుకి దగ్గిరకు చేరుకొంది.

గరుత్మంతుడి భంగపాటు విని బలరాముడు, "గరుడా! విచారించకు, నేను ఆ కోతి పని పడతాను. బలరామదేవుడు అజ్ఞాపిస్తున్నాడు, రమ్మని, ఆ వానరుడికి చెప్పు!" అన్నాడు.

గరుత్మంతుడు భయం భయంగా దూతలాగ వెళ్ళి అలాగే చెప్పాడు. హనుమంతుడు వినిపించుకో లేదు. రెక్కలు విసురుగా ఆడించి గరుత్మంతుడు అల్లకల్లోలంచేసి మరీ చెప్పాడు. దగ్గిరగా వెళ్ళి ముక్కుతో పొడవబోయి, మళ్ళీ నాలుక కరుచుకొని, వచ్చిన దారినే వెళ్ళాడు.

అప్పుడు ద్వారకలో బలరాముడితో ఏదో రాజకీయాలు మాట్లాడాలని వచ్చినట్లుగా వచ్చిన కృష్ణుడు, గరుడుడు చెప్పినదంతా విని, "వెళ్ళు. రాముడు పిలుస్తున్నాడు, అని చెప్పు!" అని గరుత్మంతుడిని తిరిగి పంపించాడు.



గరుత్మంతుడితో హనుమంతుడు ద్వారకకు వచ్చి, "ఓ రామా! నా రామా! రామా!" అంటూ ఎలుగెత్తి పిలిచాడు.

బలరాముడు గర్వంగా లేచి వెళ్ళి, "రాముడు కాదు, నేను బలరాముడిని! బలరామదేవాయ నమః అని మూడుసార్లు అంటివా, నిన్ను క్షమించగలను!" అన్నాడు.

హనుమంతుడికి గొప్ప కోపం వచ్చింది. "ఏమి టేమిటీ, బలరాముడివా నువ్వు, అబలరాముడివా?" అని పళ్లికిలించి వెక్కిరించాడు.

బలరాముడు నాగలి ఆయుధాన్ని హనుమంతుడి మీదకు ఎత్తాడు. దాన్ని తోకతో చుట్టి గిరవాటు వేశాడు హను



చెప్పాడు: "వనవాసంలో ఎల్లవేళలా సీతారాములను కాచుకొని ఉండడానికి లక్ష్మణుడు పధ్నాలుగేళ్ళు నిద్రనూ, తిండినీ మానుకొని రాముడి పట్టాభిషేకం తర్వాత నిద్రను రమ్మని చెప్పాడు. అతని నిద్ర అంతా అతని అర్ధాంగి ఊర్మిళ తీసింది. పధ్నాలుగేళ్ళు నిద్ర మాని కటిక ఉపవాసం చేసినవాడి చేతుల్లోనే ఇంద్రజిత్తు చావు కూడా రాసిపెట్టి వుంది. ఆ విధంగా నిద్ర ఒక్క క్షణమైనా ఆగకుండా పట్టాభిషేకం మరుక్షణంలో కునికిపాటు వచ్చినందుకు లక్ష్మణుడు నవ్వుకున్నాడు."

మంతుడు. కొట్టాలని వస్తున్న బలరాముడిని రెండు చేతులతో బలంగా పట్టుకొని మీదకు ఎత్తాడు. బలరాముడు విలవిలలాడుతూ మూర్ఛపోయాడు. ఆ మూర్ఛలో కలలాగ గత వృత్తాంతం నెమరుకు వచ్చింది....

రామ పట్టాభిషేకం జరిగిన మరుక్షణంలో, లక్ష్మణుడు జోగుతూ ఫక్కున నవ్వాడు. సభలో ఎవరికివారే తమనే లక్ష్మణుడు పరిహాసం చేశాడని ముఖాలు దించుకున్నారు. రాముడు లక్ష్మణుడి మీదకు కత్తి ఎత్తాడు. హనుమంతుడు అడ్డుకొని, లక్ష్మణుడిని బతిమాలి నవ్వుకు కారణం తెలుసుకొని సభవారికి ఇలా

హనుమంతుడు చెప్పినదంతా విని రాముడు, "మరి నేను వనవాసంలో ఒకనాడు తినమని లక్ష్మణుడికి అరటి పండు యిచ్చానే! అది ఏమైనట్టు?" అని అడిగాడు.

అప్పుడు లక్ష్మణుడు చర్రున కత్తితో తొడను చీల్చి, అందులోంచి అరటి పండును తీసి, "అన్నయ్య చేత్తో ప్రేమగా ఇచ్చిన పండును రామప్రసాదంగా దాచుకున్నాను. దీనితో ఉపవాసం చాలిస్తున్నాను!" అని దానిని మింగాడు.

రాముడు లక్ష్మణుడిని గాఢాలింగనం చేసుకుని, "తమ్ముడా! వచ్చే జన్మలో నీకు నేను తమ్ముడినై నీ రుణం తీర్చు

కుంటాను!'' అని సభలో బిగ్గరగా చెప్పాడు.

బలరాముడికి తాను లక్ష్మణుడిననే పూర్వజ్ఞానం కలిగి, మూర్ఛనుండి తేరుకొని హనుమంతుడితో, ''సంజీవరాయా! సంజీవిని తెచ్చి అప్పుడు మూర్ఛనుండి బతికించావు; ఇపుడు మూర్ఛతో నేనెవర్నో నాకు తెలిసేలా చేశావు! నీ రాముణ్ణి చూద్దువుగాని పద!'' అని హనుమంతుడిని కృష్ణుడి దగ్గిరకు తోడ్కొని వెళ్ళాడు.

కృష్ణుడు హనుమంతుణ్ణి చూస్తూనే బిగించిన పిడికిటితో చేతినెత్తి, "మా అన్న బలరాముడంతటివాడినే ధిక్కరిస్తావా?'' అంటూ ముష్టియుద్ధానికి కవ్వించాడు.

కృష్ణాంజనేయుల యుద్ధం చాలాసేపు జరిగింది. తనతో ఎంతో లాఘవంగా పోరాడుతున్న కృష్ణుడిని లోలోపల మెచ్చుకుంటూనే హనుమంతుడు సత్తువపూరా ఒక్క పిడిగుద్దుతో కృష్ణుడిని పడగొట్టాడు. కృష్ణుడు ఆయాసపడుతూనే విజయహాసం చేస్తూ ఏమరుపాటున ఉన్న హనుమంతుడి మీదకు సింహంలాగ లంఘించి, రొమ్ము మీద పిడికిటితో పొడిచాడు. అప్పుడు కృష్ణుడిపాదం హనుమంతుడి మీదపడింది.

ఆ పాద స్పర్శతో హనుమంతుడికి రాముడే కృష్ణుడుగా అవతరించాడని తెలిసిపోయింది. గతంలో లంకలో అగ్ని



ప్రవేశానికి ముందు రాముడు ఆడిన పరుష వాక్యాలకు సీత కంట తడి పెట్టుకున్నప్పుడు, హనుమంతుడికి రాముడి మీద పట్టరాని ఆగ్రహం వచ్చి, పిడికిలి బిగించి చేతిని ఎత్తిపట్టి, "రామా! నాతో యుద్ధం చెయ్యి!'' అన్నాడు.

రాముడు చిరునవ్వు నవ్వి, "హనుమా! ఇప్పుడు నీతో యుద్ధం చెయ్యటానికి అశక్తుణ్ణి. ముందు కాలంలో నీ కోరిక తీర్చుకుందువు గాని!" అన్నాడు.

ఆ సన్నివేశం హనుమంతుడికి గుర్తు వచ్చింది. హనుమంతుడు, ''రామా! రాముడిగానే నాకు కనిపించి నన్ను అనుగ్రహించు!'' అని వేడుకున్నాడు.



''హనుమా! కొంచెం ఆగు! లక్ష్మణుడు యిక్కడే ఉన్నాడు గదా. సీత ఇంకా రావాలి!'' అని కృష్ణుడు చెప్పి, సీతగా రమ్మని సత్యభామకు కబురు పంపాడు.

జన్మజన్మలుగా కృష్ణుడికి తానే అసలైన భార్యనని గర్వంగా అనుకునే సత్యభామ, ''అదెంతపని!'' అని ఏడువారాల నగలు అలంకరించుకొని పారిజాత పుష్పాలు కొప్పునిండా తురుముకొని, వయ్యారంగా వచ్చి ఠీవిగా కృష్ణుడి పక్క నిల్చున్నది.

హనుమంతుడు సత్యభామను చూసీ చూడంగానే, ''ఓహో! చంద్రసేనవు గదుటమ్మా నీవు! అప్పుడు రాముడు కృష్ణావతారంలో అష్టభార్యలలో ఒకతెగా నిన్ను చేసుకుంటానన్న మాట నిలబెట్టు కున్నాడన్నమాట! ధన్యురాలివమ్మా, చంద్రసేనా!'' అని అన్నాడు.

ఆ మాటలతో సత్యభామకు పూర్వ స్మృతి కలిగి గర్వం విడిచిపెట్టి, రుక్మిణి దగ్గరకి వెళ్ళి, ''అక్కా, సీతవైన నువ్వు హనుమంతుడిని అనుగ్రహించు!'' అని వేడుకుంది.

రుక్మిణి సీతగా వచ్చింది. కృష్ణుడు కోదండరాముడై కుడిచేత్తో హనుమంతుడిని దీవించాడు. బలరాముడు లక్ష్మణుడై వినయంగా నిల్చున్నాడు. హనుమంతుడు రాముడి పాదాన్ని తదేకంగా చూస్తూ చేతులు జోడించి, బ్రహ్మానందంలో మునిగి పోయాడు.

రామావతార రూపం ఉపసంహరించు కొని కృష్ణుడు హనుమంతుణ్ణి తట్టి, ''హనుమా! నువ్వు వెళ్ళి హిమాలయ సానువుల్లో వున్న కదళీవనంలో వుండు. అక్కడికి నీకు తమ్ముడైన వాయు కుమారుడు భీముడు వస్తాడు. అతనికి గదా యుద్ధం, మల్లయుద్ధంలోని మెళకువ లన్నీ చేసి చూపించి, నేర్పు!'' అని చెప్పాడు.

సత్యభామ హనుమంతుడి ముంగిటకు వచ్చి, ''ఆనాడు రాముడిని నా దగ్గిరికి తీసుకువచ్చి, ఈ నాటి నా భాగ్యానికి

కారకుడివైన నీకు నా కృతజ్ఞత చెప్పు కుంటున్నాను!'' అని నమస్కరించింది.

హనుమంతుడు ఆమెకు తిరిగి నమస్కారం చేస్తూ, "అమ్మా, నీవు సత్య-భామవు; సత్యానికి దేవుడు ఎల్లప్పుడూ వశవర్తిగా ఉంటాడనే అర్థం స్ఫురించే లాగ కృష్ణుడు నిన్ను వరించి, నీ ముద్దు మురిపాలు చెల్లిస్తూ, సత్యాపతి అనే బిరుదు పొందాడు; ధన్యురాలివి! నీవు నాకు సీతతో సమానం!'' అని చెప్పాడు.

అతని మాటలకు సత్యభామ ఆనందంతోపులకించి, "ఇన్నాళ్ళకు హనుమంతునివల్ల సత్యాన్ని తెలుసుకున్నాను, గర్వాన్ని విడిచిపెట్టాను!'' అని చెప్పింది.

హనుమంతుడు రుక్మిణీ కృష్ణులకు ప్రణమిల్లి బయలుదేరబోతూండగా బలరాముడు హనుమంతుడిని కౌగిలించుకొని, "సంజీవరాయా! నీ వలన నన్ను నేను తెలుసుకున్నాను, అహంకారాన్ని వదులుకున్నాను, నీకు నా ధన్యవాదాలు!'' అని చెప్పాడు.

గరుత్మంతుడు హనుమంతుడికి వందనం చేస్తూ, "వీరహనుమా! క్షీరసాగరంలో తన సన్నిధానంలో నాకు తోడుగా నీవు కూడ వచ్చి ఉండబోతున్నావని మహావిష్ణువు నాతో చెప్పినది ఇప్పుడు గుర్తుకు వస్తున్నది!'' అని చెప్పి అతడితో కదళీవనం వరకూ వెంట వెళ్ళాడు.

కదళీవనం ఎత్తైన అరటి చెట్లతో, అనేక తోపులతో, ఇంకా అనేక ఫల వృక్షాలతో నిండుగా ఎంతో ఆహ్లాదకరంగా ఉంది. హిమశిఖరాలనుండి జారివస్తూన్న సెలఏళ్ళు మిలమిలా మెరుస్తున్నవి.

హనుమంతుడు కదళీవనం ప్రవేశించి పండు ముసలి కోతి రూపంతో ఒకపెద్ద అరటిచెట్టు బోదెను ఆనుకొని, కాళ్లు చాచుకొని, కూర్చున్నాడు. అతని తోక నిటారుగా దారికడ్డంగా పరుచుకొని వుంది. చేతికందుబాటులో గద వున్నది.

హనుమంతుడు, కన్నులు మూసి రాముణ్ణి ధ్యానిస్తూ, రామనామం జపిస్తూ వున్నాడు.





# దధీచి త్యాగం

విశ్వకర్మ కొడుకును ఇంద్రుడు చంపాడు. దానికి ప్రతిక్రియగా విశ్వకర్మ యజ్ఞం చేస్తే, యజ్ఞ కుండం నుంచి వృత్రాసురు డనే భయంకరుడు పుట్టాడు.



వృత్రాసురుడు విశ్వకర్మ కోరిక తీర్చు తానని మాట ఇచ్చి, బ్రహ్మను గురించి నూరేళ్ళు తపస్సు చేశాడు.



బ్రహ్మవరం పొందినట్టయితే వృత్రాసురుణ్ణి జయించటం అసాధ్యమనుకుని, ఇంద్రుడు మొదలైన దేవతలు వృత్రుడి తపస్సు భగ్నం చేయ తలపెట్టారు.



అందుకోసం వారు వృత్రుడి ఏకాగ్రతను చెడగొట్టటానికి అప్సరలను పంపారు. అప్సరలు ఆడారు, పాడారు, కాని లాభం లేకపోయింది. వృత్రుడు వారి కేసి చూడనేలేదు.

చివరకు వృత్రుడి ముందు బ్రహ్మ ప్రత్యక్షమై, వరం కోరుకోమన్నాడు. తాను పగలుగాని, రాత్రిగాని, కర్రతోనూ, లోహంతోనూ చేసిన ఆయుధం వల్ల గాని, నిప్పువల్లగాని చావకుండా వరం కోరాడు వృత్రుడు.





తరవాత వృత్రాసురుడు తన రాక్షస బలాలతో దేవతలపైనబడి పీడించ సాగాడు. యుద్ధాలు చాలా కాలం సాగాయి.

దేవతలు వృత్రుణ్ణి ఏమీ చెయ్యలేక పోయారు. వారు అతని ఎదుటి నుంచి పారిపోయారు. ఒంటరిగా తనతో పోరాడుతున్న ఇంద్రుణ్ణి వృత్రుడు పట్టుకుని మింగేశాడు.





ఓడిపోయిన దేవతలు తమ గురువైన బృహస్పతి వద్దకు పోయి తమ గోడు చెప్పుకున్నారు. బృహస్పతి ఆవలింతను సృష్టించాడు.

ఆవలింత వెళ్లి వృత్రుణ్ణి ఆవహించింది. వృత్రుడు ఆవలించగానే ఇంద్రుడు బయటపడ్డాడు.





వృత్రుడు ఏ ఆయుధంచేతగాని, నిప్పు చేతగాని చావడు. ఎవరైనా మహర్షి యొక్క ఎముక సహాయంతో వృత్రుడు చస్తాడు. ఇంద్రుడు దధీచి వద్దకు వెళ్ళి సంగతి చెప్పాడు.



దధీచికి ఇంద్రుడంటే ఆదరం లేదు. కాని వృత్రుడు లోక కంటకుడు. వాడు చావాలి. అందుకని ఆయన సమాధి లోకి పోయి, దేహత్యాగం చేశాడు. అదే దధీచి త్యాగం.



దధీచి ఎముకను వజ్రాయుధంగా తయారుచేసి, పగలూ, రాత్రీ కాని సంధ్యవేళ ఇంద్రుడు వృత్రాసురుణ్ణి చంపాడు.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

?

అజామీళుడు మహాపాపి అయి కూడా, చచ్చిపోతూ తన కొడుకును "నారాయణా!" అని పిలవటం చేత ముక్తి పొందినట్టు విని, ఒక వర్తకుడు తన ఎనిమిదిమంది కొడుకులకూ విష్ణుమూర్తి పేర్లే పెట్టుకున్నాడు. వర్తకంలో అతను చెయ్యని పాపంలేదు. అందుచేత అతను తన ఆఖరు జబ్బులో నలుగురు కొడుకులను వర్తకం చూడమనీ, మిగిలిన నలుగురినీ తన మంచం దగ్గిరే ఉండమనీ హెచ్చరించాడు.

వర్తకుడు అనుకున్నట్టు అతనికి ఆఖరు క్షణాలు రానే వచ్చాయి. అది తెలిసి కొడుకులు ఎనిమిది మందీ అతని మంచం దగ్గిరే చేరారు. వారిని చూసి వర్తకుడు, "అందరూ ఇక్కడే ఉన్నారా? కొట్టు దగ్గిర ఎవరూ లేకపోతే దొంగలు పడరూ? దొంగలు! దొంగలు!" అంటూ ప్రాణాలు వదిలి, వచ్చే జన్మలో దొంగగా పుట్టాడు! —ఎస్. ఆర్. కె. నాయర్.

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2&3 ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు 600 026 అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలింపబడవు.

కార్డులు మాకు జూలై 20 లోగా చేరాలి. అందులో ఫొటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, సెప్టెంబరు నెల చందమామలో ప్రకటించబడును.

---

మే నెల పోటీ ఫలితం: మెప్పులో దెప్పు

గెలుపొందిన వారి పేరు: ఆర్. పట్టాభిరామరాజు ఎం. ఏ. రేణూతల.

రాజంపేట తాలూకా. (కడప జిల్లా)

# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1978 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.







C. K. Sathyaraj A. L. Syed

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ జూలై నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : చెప్పడానికి ముందు

రెండవ ఫోటో : చెప్పేది విను

పంపినవారు : బి. వి. సత్యనారాయణమూర్తి. సిల్వర్ జూబిలీ ప్రభుత్వ కళాశాల, కర్నూలు.

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.


బామ్మగారి పేజీ
వ్యాసాలు
తీరికవేళల్లో....
గొప్పవారితో గోష్ఠులు
మాటల కొలువు
వార్తలు....
కుటీర పరిశ్రమలు
కథలు....సశేష నవలలు
అవి – ఇవి
సమస్యలూ సలహాలూ
మన దేవాలయాలు
పెరటితోట పెంపకం
పిల్లల పుట్టిన రోజులు
వైద్య సలహాలు
గృహాలంకరణ
పొరుగు రాష్ట్రాల వంటలు
ప్రపంచ వార్తలు
మొదలైనవన్నీ గల స్త్రీజన
మాసపత్రిక ఏది? చెప్పు చూదాం!
వనిత—మా యింట్లో
అందరికీ ఇష్టమైన
వనిత

వహ్వా! దాని రుచి అంటే నాకు బలే మజా!'







గోల్డ్ స్పాట్–దీని రుచి పెదవిపై చిరునవ్వుగా మారుతుంది.

Creative Unit 3538Tel.